శ్రీః

శ్రీ అరవిందులవారి సంస్కృతకావ్యమ్

# భవానీభారతీ

ఆంధ్రటీక - డా॥ సూరం శ్రీనివాసులు




ప్రకాశకులు

**రావి మోహనరావు,** M.Sc., M.A.

**404, జంజనం కాంప్లెక్స్, చీరాల - 523 155.**

శ్రీః

శ్రీ అరవిందులవారి సంస్కృతకావ్యమ్

# భవానీభారతీ

ఆంధ్రటీక – డా॥ సూరం శ్రీనివాసులు

ప్రతులు : 500

ప్రథమ ముద్రణ : నవంబరు 24, 2019

పుటలు : 112

వెల : రూ. 60/–


404, Janjanam Complex,
Opp. I-Town Police Station,
**CHIRALA** - 523 157. **Cell : 94401 15411**

D.T.P.:
**P. PARVATHI**
Cell : 7416586775.

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.



# ఉత్తిష్ఠతోత్తిష్ఠత

శ్లో॥ అఖణ్డభారతావన్యా-
మనైక్యమధునా తదా ।
ఏకోన్ముఖాః కుతో న స్యు-
శ్చైతన్యరహితా ను కిమ్ ॥

- రామోరా.





**P.C. Swaroop**
**Chairman**
**Sri Aurobindo Society**
**Eluru Centre.**

**Dear Mr. Swaroop**

This refers to your letter dated 3rd May, 2019, regarding the publication of the Telugu Translation of "**Bhavani Bharati**".

We are glad to tell you that we have no objection to your translating "**Bhavani Bharati**" into Telugu and subsequently publising it.

Due acknowledgement may be made to the Sri Aurobindo Ashram Trust for the above permission and on publication of the book, 6 complimentary copies of it may be sent to The Copyright Department, Sri Aurobindo Ashram.

With good wishes,

Sincerely,

**Manoj Das Gupta**
Copyright Department,
**Sri Aurobindo Ashram,**
**Pondicherry.**





# కృతజ్ఞతలు

**శ్రీ అరవిందులవారు** రచించిన ఇక్కావ్యమునకు తెనుగుటీక నందించిన డా॥ సూరం శ్రీనివాసులు, Retd., Principal, Oriental Degree College, తిమ్మసముద్రం, గార్కి; తెనుగున పూర్వప్రతినందించుటతోబాటు తెనుగున ముద్రించుటకు శ్రీఅరవిందాశ్రమమువారి అనుమతి తీసుకొన్న మిత్రుడు Dr. P.C. Swaroop గార్కి; శ్రీ A. మల్లయ్య, తెనుగుశాఖ, అరవిందా–శ్రమం వారికి; **Dr. Manoj Das Gupta,** Copyright Department, **Sri Aurobindo Ashram, Pondicherry** వార్కి కృతజ్ఞతలు.

**– రామోరా, సంపాదకుడు.**







Sri Aurobindo's Symbol

The descending triangle represents Sat-Chit-Ananda. The ascending triangle represents the aspiring answer frommatter under the form of life, light and love.

The junction of both — the central square — is the perfect manifestation having at its centre the Avatar of the Supreme — the lotus.

The water — inside the square — represents the multiplicity, the creation.





శ్రీః

# భవానీ భారతీ

శ్లో॥ సుఖే నిమగ్నశ్శయనే యదాసం
మధోశ్చ రథ్యాసు మనశ్చచార ।
స చిన్తయామాస కులాని కావ్యం
దారాంశ్చ భోగాంశ్చ సుఖం ధనాని ॥ 1

ప్ర : సఖే! = మిత్రమా!, యదా = ఏ సమయంలో, (అహమ్ = నేను), శయనే = పక్కపై, సుఖే = సుఖంలో, నిమగ్నః = మునిగిపోయినవాడనుగా, ఆసమ్ = అయితినో, మధోః = వసంతంయొక్క, రథ్యాసు = వీథులలో/బాటలలో, మనః = మనస్సు, చచార = నడిచిందో, (తదా = ఆ సమయంలో), సః = అటువంటి నేను, కులాని = నావారిని గూర్చి, కావ్యమ్ = కావ్యాన్ని గూర్చి, దారాన్ = భార్యను గురించి, భోగాన్ చ = భోగాలను గూర్చీ, సుఖమ్ = సుఖాన్ని గురించి, ధనాని చ = డబ్బు గురించి కూడా, చిన్తయామాస = ఆలోచించాను.

తాత్పర్యం : మిత్రమా! నేను నా శయ్యపై పడుకొని సుఖంలో మగ్నమై వున్నప్పుడు నా మనస్సు వసంతవీథులలో విహరిస్తోంది. అప్పుడు ఆ నా మనస్సు నా వారిని గురించీ, కవిత్వాన్ని గురించీ, భార్యను గురించీ, భోగాలను గురించీ, సుఖాన్ని గురించీ, ధనాన్ని గురించీ ఆలోచించింది.





శ్లో॥ కాన్తైశ్చ శృఙ్గారయుతైశ్చ హృష్టో
గానైః స ఛన్దో లలితం బబన్ధ ।
జగౌ చ కాన్తావదనం సహాస్యం
పూజ్యే చ మాతుశ్చరణే గరిష్ఠే ॥ 2

ప్ర : హృష్టః = ఆనందించినవాడనై, సః = ఆ నేను, కాన్తైః చ = కోరదగినవియూ, శృంగార–యుతైః చ = శృంగారరసంతో కూడినవియూ అయిన, గానైః = పాట (పాడుట)లతో, లలితమ్ = మృదువైన, ఛన్దః బబన్ధ = కవితలల్లాను. సహాస్యమ్ = నవ్వుతో కూడిన, కాన్తావదనం చ = ప్రియురాలి ముఖాన్ని గూర్చి, జగౌ = పాడాను. గరిష్ఠే = మహాశ్రేష్ఠములూ, పూజ్యే = కొలువదగినవీ అయిన, మాతుః = తల్లియొక్క, చరణే చ = పాదాలను గురించీ, జగౌ = పాడాను.

తా : ఆనందానికి లోనైన నేను కమనీయ శృంగారభావనలతో లలితంగా కవితలల్లాను. నగవుతో కూడిన ప్రియావదనాన్ని గూర్చి గానం చేశాను. పవిత్రతా, పూజ్యతా గల మాతృచరణాలను గురించి కూడా గానం చేశాను.





శ్లో॥ చక్రన్ద భూమిః పరితో మదీయా
ఖలో హి పుత్త్రానసురో మమర్ద ।
స్వార్థేన నీతో ఽహమనర్చ* పాదౌ
దురాత్మనో భ్రాతృవధేన లిప్తౌ ॥ 3

ప్ర : మదీయా = నాయొక్క, భూమిః = నేల (దేశం), పరితః = (నా) చుట్టూ, చక్రన్ద = ఆక్రోశించింది. హి = ఎందుకంటే, ఖలః = దుర్మార్గుడైన, అసురః = రాక్షసుడు, పుత్త్రాన్ = కన్నబిడ్డలను (ప్రజలను), మమర్ద = ఒత్తిడికి గురిచేశాడు. స్వార్థేన = స్వప్రయోజనంతో, నీతః = నడిపింపబడిన, అహమ్ = నేను, భ్రాతృ-వధేన = సోదరుని హననంతో (కారిన నెత్తుటితో), లిప్తౌ = పూయబడిన, దురాత్మనః = ఆ దుష్టునియొక్క, పాదౌ = కాళ్ళను, అ(ఆ)నర్చ = పూజించాను.

తా : నాచుట్టూ ఉన్న నా దేశం ఆక్రోశించింది. ఆ దుర్మార్గుడైన రాక్షసుడు తన బిడ్డలను ఒత్తిడికి గురిచేశాడు కదా మరి. నేను నా స్వార్థానికి లోబడి సోదరుని హననంతో కారిన నెత్తుటితో తడిసిన ఆ దుర్మార్గుని పాదాలను అర్చించాను.





**శ్లో॥ సుఖం మృదావాస్తరణే శయానం**
**సుఖాని భోగాన్వసు చిన్తయన్తమ్ ।**
**పస్పర్శ భీమేన కరేణ వక్షః**
**ప్రత్యక్షమక్ష్ణోశ్చ బభూవ కాలీ ॥ 4**

ప్ర : మృదౌ = సున్నితమైన, ఆస్తరణే = పరుపుపై, సుఖమ్ = హాయిగా, శయానమ్ = పడుకొని, సుఖాని = సౌకర్యాలను గూర్చి, భోగాన్ = అనుభవాలను/విలాసాలను గూర్చి, వసు = ధనాన్ని గూర్చి, చిన్తయన్తమ్ = ఆలోచిస్తున్న నన్ను, కాలీ = కాళికాదేవి, భీమేన = భయంకరమైన, కరేణ = చేతితో, వక్షః = గుండెను, పస్పర్శ = తాకింది. అక్ష్ణోః = కళ్ళకు, ప్రత్యక్షం చ = ఎదురుగా, బభూవ = నిలిచింది.

తా : నేను సున్నితమైన పరుపుపై శయనించి సుఖభోగాలను గురించీ, ధనాన్ని గురించీ, ఆలోచిస్తున్నాను. అప్పుడు కాళికాదేవి తన భీకరకరంతో నా గుండెలపై స్పృశించి, నా కళ్ళ ఎదుట కనిపించింది.





శ్లో॥ నరాస్థిమాలాం నృకపాలకాఞ్చీం
వృకోదరాక్షీం క్షుధితాం దరిద్రామ్ ।
పృష్ఠే వ్రణాఙ్కామసురప్రతోదైః
సింహీం నదన్తీమివ హన్తుకామామ్ ॥ 5

ప్ర : నరాస్థిమాలామ్ : నర = మానవులయొక్క, అస్థి = ఎముకలతో కూర్చిన, మాలామ్ = హారాలు గలదీ, నృ–కపాల–కాంచీమ్ : నృ = నరులయొక్క, కపాల = పుఱ్ఱెలతో కూర్చిన, కాంచీమ్ = మొలనూలు గలదీ, వృక+ఉదర+అక్షీమ్ : వృక = తోడేలు యొక్క, ఉదర = పొట్టవంటి పొట్ట, అక్షీమ్ = కన్నుల వంటి కన్నులు గలదీ, క్షుధితామ్ = ఆకొన్నదీ, దరిద్రామ్ = పేదరాలూ, అసురప్రతోదైః : అసుర = రాక్షసునియొక్క, ప్రతోదైః = చర్నకోలలచే, పృష్ఠే = వెనుకభాగాన, వ్రణ+అంకామ్ = గాయాల మచ్చలు గలదీ, హన్తు–కామామ్ = హింసింపదలచి, నదన్తీమ్ = గాండ్రిస్తున్న, సింహీమ్ ఇవ = ఆడ సింహమువలె నున్నదీ... (7వ శ్లోకంలోని జననీం పదంతో అన్వయం)

తా : కళ్ళకు కనిపించిన కాళి నరుల ఎముకల దండలను ధరించింది. నరుల పుఱ్ఱెలతో కూర్చిన మొలనూలు ధరించింది. ఆమె కన్నులూ, పొట్ట తోడేలును తలపిస్తున్నాయి. ఆమె ఆకలితో వున్న పేదరాలు. రాక్షసుని చర్నకోల దెబ్బలతో ఏర్పడిన గాయాల మచ్చలు ఆమె వెనుక కనిపిస్తున్నాయి.





శ్లో॥ క్రూరైః క్షుధార్తైర్నయనైర్జ్వలద్భి-
ర్విద్యోతయన్తీం భువనాని విశ్వా ।
హుఙ్కారరూపేణ కటుస్వరేణ
విదారయన్తీం హృదయం సురాణామ్ ॥ 6

ప్ర : క్రూరైః = భయంకరమైనవీ, క్షుధా+ఆర్తైః = ఆకలితో పీడింపబడినవీ, జ్వలద్భిః = మండుతున్నవీ అయిన, నయనైః = కళ్ళతో, విశ్వా = సమస్తములైన, భువనాని = లోకాలను, విద్యోతయన్తీమ్ = వెలుగజేస్తున్నదీ, హుంకార-రూపేణ = హుంకార రూపమైన, (అదిలింపు, బెదిరింపులకు వాడే ధ్వని హుంకారం), కటు-స్వరేణ = కఠినమైన ఎలుగుతో, సురాణామ్ = దేవతలయొక్క, హృదయమ్ = మనస్సు(ల)ను, విదారయన్తీమ్ = చీల్చుతున్న (7వ శ్లోకంలోని జననీం పదంతో అన్వయం).

తా : కళ్ళకు కనిపించిన ఆ కాళి కన్నులు ఆకలిగొన్నట్టు మండుతూ, క్రూరంగా కనిపిస్తూ, సమస్తభువనాలనూ ప్రజ్వలింపజేస్తున్నాయి. ఆమె హుంకరిస్తోంది. ఆ కటుస్వరంతో దేవతల గుండెలు బ్రద్దలవుతున్నాయి.





శ్లో॥ ఆపూర్య విశ్వం పశువద్విరావై-
ర్లేలిహ్యమానాఞ్చ హనూ కరాలే ।
క్రూరాఞ్చ నగ్నాం తమసీవ చక్షు-
ర్హింస్రస్య జన్తోర్జననీం దదర్శ ॥ 7

ప్ర : పశువత్ = జంతువువంటి, విరావైః = అరుపులతో, విశ్వమ్ = లోకాన్ని, ఆపూర్య = నింపి, కరాలే = భయంకరమైన, హనూ = దవడలను, లేలిహ్యమానామ్ చ = నాకుతున్నదీ, క్రూరామ్ = భీకరమైనదీ, నగ్నామ్ = దిగంబరమైనదీ, తమసి = చీకటిలో, హింస్రస్య = హింసించే స్వభావం గల, జన్తోః = పశువుయొక్క, చక్షుః ఇవ = కంటివలె నున్న. జననీమ్ = తల్లిని (కాళీమాతను), దదర్శ = చూశాడు.

తా : ఆమె జంతుధ్వనులవంటి క్రూరధ్వనులతో లోకాన్ని నింపుతోంది. భయంకరమైన దవడలను నాకుతోంది. నగ్నంగా, క్రూరంగా కనిపిస్తోంది. చీకటిలో హింసించే స్వభావం గల జంతువు కన్నులా కనిపిస్తోంది. అటువంటి కాళీమాత కనుల ముందు నిలిచింది.





**శ్లో॥ ఆలోలకేశైః శిఖరాన్నిగృహ్య**
**కరాళదంష్ట్రైశ్చ విసార్య సిన్ధూన్ ।**
**శ్వాసేన దుద్రావ నభో విదీర్ణం**
**న్యాసేన పాదస్య చ భూశ్చకమ్పే ॥ 8**

ప్ర : ఆలోల–కేశైః = బాగా కదులుతున్న కురులతో, శిఖరాన్ = (కొండ) కొనలను, నిగృహ్య = కప్పి, కరాళ–దంష్ట్రైః = క్రూరమైన కోరపళ్ళతో, సింధూన్ = సముద్రాలను, విసార్య = వెనుకకు నడిపించి, శ్వాసేన = ఊర్పుతో, విదీర్ణమ్ = బ్రద్దలైన, నభః = ఆకాశాన్ని, దుద్రావ = చెల్లాచెదరు చేసింది/ పరువులు పెట్టించింది, పాదస్య = (ఆమె) కాలియొక్క, న్యాసేన = ఉంచుటచేత, భూః = నేల, చకమ్పే చ = కంపించింది.

తా : ఆమె కురులు విప్పారుకొని కదులుతూ, కొండ కొనలను కప్పివేస్తున్నాయి. భీకరంగా ఉన్న ఆమె కోరపళ్ళు సముద్రాలను వెనక్కు నెడుతున్నాయి. ఆమె ఊర్పుతో ముక్కలైన ఆకాశం చెదిరిపోతోంది. ఆమె అడుగు మోపినంతనే భూమి కంపిస్తోంది.





శ్లో॥ ఉత్తిష్ఠ దేహీతి పిపాసురమ్బా
దధ్వాన రాత్రౌ నగరే వితారే ।
సేయం స్తనన్తీ రజనీం తమిస్రాం
బభౌ సమాపూర్య మనాంసి చార్యా ॥ 9

ప్ర : ఉత్తిష్ఠ = లే, దేహి = ఇవ్వు, ఇతి = అని, రాత్రౌ = రాత్రియందు, వితారే = వెలుతురు లేని, నగరే = నగరంలో, పిపాసుః = దప్పికగొన్న, అంబా = ఆ తల్లి, దధ్వాన = ధ్వనించింది. సా = అటువంటి, ఇయమ్ ఆర్యా = ఈ పూజ్యురాలు (కాళి), స్తనన్తీ = = శబ్దంచేస్తూ, రజనీమ్ = రాత్రిని, మనాంసి చ = మనస్సులను కూడా, తమిస్రామ్ = చీకటిని, ఆపూర్య = నింపి, బభౌ = ప్రకాశించింది.

తా : ఆ రాత్రి తారలు లేవు. నగరంలో వెలుగు లేదు. 'లే – ఇవ్వు' అన్న ఆ అరుపులతో నగరం ప్రతిధ్వనించింది. ఆమె అలా అరుస్తూ తిరుగుతూ ఆ రాత్రినీ, ప్రజల మనస్సులనూ కూడా చీకటితో నింపింది.





శ్లో॥ భీతస్సముద్విగ్నమనాశ్చ తల్పా-
దుత్థాయ పప్రచ్ఛ తమో నమస్యమ్ ।
కా భాసి నక్తం హృదయే కరాలి!
కుర్వీయ కిం బ్రూహి నమోఽస్తు భీమే! ॥ 10

ప్ర : (అహమ్ = నేను), భీతః = భయపడినవాడనూ, సముద్విగ్న-మనాః చ = కలతపడిన మనస్సు గలవాడనూ, అయి, తల్పాత్ = పక్కమీదనుండి, ఉత్థాయ = లేచి, నమస్యమ్ = పూజార్హమైన, తమః = (ఆ) చీకటిని, పప్రచ్ఛ = అడిగాను.... కరాలి! = భీకరమైనదానా!, నక్తమ్ = రేయి, హృదయే = మనస్సులో, భాసి = ప్రకాశిస్తున్నావు. కా? = (నీవు) ఎవర్తెవు?, కిమ్ = దేనిని, కుర్వీయ = చేయగలను?, బ్రూహి = చెప్పు. భీమే! = భీకరమైనదానా, నమః+అస్తు = (నీకు) నమస్కారం.

తా : నేను భయపడ్డాను. మనస్సు కలతపడింది. పక్కపై నుండి లేచాను. నమస్కారానికి తగిన ఆ చీకటికి నమస్కరించాను. భీకరమైనదానా! రాతిరి హృదయంలో ప్రకాశిస్తున్నావు? నీ వెవరు? నేనేం చేయాలి? చెప్పు. భయంకరరూపా! నీకు నమస్సు.





శ్లో॥ సింహస్య సా రావముదీరయన్తీ
క్రూరస్య కుఞ్జే భ్రమతో వధార్థమ్ ।
ససర్జ వాక్యాని కరాలమూర్తి-
ర్యథా సముద్రస్తనితం శిలాయామ్ ॥ 11

ప్ర : వధార్థమ్ = చంపటానికై (వేటకై), కుంజే = పొదలో, భ్రమతః = తిరుగుతున్నట్టి, క్రూరస్య = భీకరమైన, సింహస్య = సింహంయొక్క, రావమ్ = అరుపువంటి అరుపును, ఉదీరయన్తీ = ప్రకటిస్తూ, సా = ఆ, కరాల-మూర్తిః = భీకరరూపంగల ఆ దేవి, శిలాయామ్ = రాతిపై, సముద్ర-స్తనితం యథా = సముద్రఘోషవంటి, వాక్యాని = మాటలను, ససర్జ = వెలువరించినది.

తా : వేటకై పొదలో పొంచివున్న క్రూరసింహంయొక్క అరుపువంటి అరుపును వెలువరిస్తూ ఆమె బండలపై సముద్రపుఘోష (తాకిడిచేత పుట్టే శబ్దం) వంటి మాటలను వెలువరించింది.





శ్లో॥ మాతాఽస్మి భోః పుత్త్రక! భారతానాం
సనాతనానాం త్రిదశప్రియాణామ్ ।
శక్తో న యాన్ పుత్త్ర! విధిర్విపక్షః
కాలోఽపి నో నాశయితుం యమో వా ॥ 12

ప్ర : భోః = ఓయీ!, పుత్త్రక! = కుమారా!, త్రిదశ–ప్రియాణామ్ = దేవతలకు ఇష్టులైన, సనాతనానామ్ = ప్రాచీనులైన, భారతానామ్ = భారతీయులకు, మాతా – అస్మి = తల్లిని. యాన్ = ఎవరినైతే, పుత్ర = కుమారా!, విపక్షః (సన్ ) = శత్రువై, విధిః = బ్రహ్మ/విధి కానీ, నాశయితుమ్ = నశింపజేయుటకు, న శక్తః = సమర్థుడు కాదు. కాలః = కాలం కానీ, యమః వా = యముడు/మృత్యువు కానీ, నాశయితుమ్ = అంతరింపజేయుటకు, నో శక్తః = సమర్థుడు గాదు.

తా : నాయనా! దేవతలు మెచ్చిన సనాతనభారతీయుల మాతను నేను. ఆ భారతీయులను శత్రువుగా మారినా విధికూడా నాశనం చేయజాలదు. కాలంగానీ, యముడు గానీ అంతరింపజేయజాలరు.





శ్లో॥ తే బ్రహ్మచర్యేణ విశుద్ధవీర్యా
జ్ఞానేన తే భీమతపోభిరార్యాః ।
సహస్రసూర్యా ఇవ భాసురాస్తే
సమృద్ధిమత్యాం శుశుభుర్ధరిత్ర్యామ్ ॥ 13

ప్ర : తే = ఆ సనాతనభారతీయులు, బ్రహ్మచర్యేణ = బ్రహ్మచర్యంతో, విశుద్ధ–వీర్యాః = నిర్మల వీర్యవంతులైన, తే = వారు, జ్ఞానేన = జ్ఞానంచే, భీమ–తపోభిః = భీకర–తపస్సులచేతా, ఆర్యాః = పూజనీయులు. తే = వారు, భాసురాః సన్తః = ప్రకాశిస్తున్న వారై, సమృద్ధిమత్యామ్ = సంపన్నమైన, ధరిత్ర్యామ్ = భూమిపై, సహస్రసూర్యాః ఇవ = వేలసూర్యులవలె, శుశుభుః = శోభించారు.

తా : ఆ సనాతనభారతీయులు బ్రహ్మచర్యంతో పవిత్రమైన వీర్యవంతులు. జ్ఞానం వలనా, తీవ్రతపస్సులవలనా వారు పూజనీయులు. వారు సంపన్నమైన ఈ భరతభూమిలో వేలసూర్యులవలె వెలుగొందినవారు.





శ్లో॥ శూరాః ప్రగల్భాశ్చ హి శాత్రవాణాం
స్పర్ధాలవం సోఢుమమర్షణాస్తే ।
పూజాం జనన్యా రిపుభిస్సమాప్య
రేజూ రణాన్తే రుధిరాక్తదేహాః ॥ 14

ప్ర : శూరాః = శూరులును, ప్రగల్భాః చ = పోడిమిగలవారును అయిన, తే = వారు, శాత్రవాణామ్ = శత్రువులయొక్క, స్పర్ధా–లవమ్ = కొంచెం పోటీని కూడా, సోఢుమ్ = సహించలేని, అమర్షణాః = రోషం కలవారు. హి = అందువలననే, తే = వారు, రిపుభిః = శత్రువుల (ప్రాణాల)తో, జనన్యాః = తల్లియొక్క, పూజామ్ = పూజను, సమాప్య = ముగించి, రుధిర+ఆక్త–దేహాః = నెత్తుట తడిసిన తనువులు గలవారై, రణాన్తే = యుద్ధం ముగింపులో, రేజుః = ప్రకాశించారు.

తా : ఆ సనాతనభారతీయులు శూరులూ, ప్రగల్భులూను. శత్రువులస్పర్ధను లవమాత్రంగా కూడా సహించేవారు గాదు. శత్రువుల ప్రాణాలతో మాతృదేవి పూజను ముగించి, రణాంతంలో రక్తసిక్తదేహాలతో విరాజిల్లేవారు.





శ్లో॥ దీనాః క ఏతే ఘృణినో దరిద్రా-
శ్శాన్తిం జఘన్యాం గణికామివాన్ధాః ।
భజన్తి భోః కాపురుషాః కుబుద్ధ్య
ఆలిఙ్గ్య యే మోదథ మృత్యుమేవ ॥ 15

ప్ర : భోః = ఓయీ! (గమనించు), ఏతే = ఈ (ఈనాటి భారతీయులు), కే = ఎవరు (ఎటువంటివారు)?, దీనాః = దీనులు, ఘృణినః = మోమోటం గలవారు, దరిద్రాః = పేదవారు, అన్ధాః (సన్తః) = గ్రుడ్డివారై, గణికామ్ ఇవ = వేశ్యనువలె, జఘన్యామ్ = గర్హితమైన, శాంతిమ్ = శాంతిని, భజన్తి = ఆశ్రయిస్తున్నారు, యే = ఎవరైతే, కాపురుషాః = కుత్సితజనులై, కుబుద్ధ్యః = చెడ్డబుద్ధిగలవారై, మృత్యుమ్-ఏవ = మృత్యువునే, ఆలింగ్య = కౌగిలించుకొని, మోదథ = ఆనందిస్తున్నారో!

తా : ఓ జనులారా! గమనించండి. ఈనాటి భారతీయులు ఎటువంటివారు? దీనులూ, దరిద్రులూ, ఆత్మశంకా పరాయణులూ, గ్రుడ్డివారూ అయి వేశ్యనాశ్రయించినట్లు హేయమైన శాంతిని ఆశ్రయిస్తున్నారు. బుద్ధిచెడి, ఈ కాపురుషులు మృత్యువునే కౌగిలించుకొని ఆనందిస్తున్నారు.





శ్లో॥ క్లీబాః కియన్త్యేవమసూన్ దినాని
ధరిష్యథార్తాః ప్రహృతా వృథైవ ।
హసన్త్యమిత్రా అపమానరాశిం
క్రీణీథ శాన్త్యా ధనశోషణఞ్చ ॥ 16

ప్ర : క్లీబాః (సన్తః) = నపుంసకులై (సామర్థ్యహీనులై), ప్రహృతాః = (శత్రువులచే) కొట్టబడి, ఆర్తాః = దీనులై, కియన్తి దినాని = ఎన్ని రోజులు, వృథా+ఏవ = నిరర్థకంగా, ఏవమ్ = ఈ రీతిగా, అసూన్ = ప్రాణాలను, ధరిష్యథ ఏవ = భరిస్తూనే ఉంటారు?, అమిత్రాః = శత్రువులు, హసన్తి = నవ్వుతున్నారు. శాన్త్యా = శాంతితో, అపమాన-రాశిమ్ = అవమానపు ప్రోవునూ, ధన-శోషణం చ = ధనం ఎండిపోవటాన్నీ (సంపద్వినాశనాన్నీ), క్రీణీథ = కొంటున్నారు?

తా : నపుంసకులారా! శత్రువులు పీడిస్తున్నా దీనులై, నిష్ప్రయోజనంగా ఎన్నాళ్ళు ఇలా ప్రాణాలు నిలుపుకొంటారు? శత్రువులు నవ్వుతున్నారు. మీరు శాంతితో అవమాన పరంపరనూ, సంపద్వినాశనాన్నీ కొనుక్కొంటున్నారు.





శ్లో॥ మ్లేచ్ఛస్య పూతశ్చరణామృతేన
గర్వం ద్విజో஽స్మీతి కరోతి కో஽యమ్ ।
శూద్రాదథానార్యతరో஽సి శూద్రో
వ్రతైః కిమేతైర్నరకస్య పాన్థే ॥ 17

ప్ర : మ్లేచ్ఛస్య = నీచజాతివానియొక్క, చరణ+అమృతేన = పాదస్పర్శ అనే అమృతంతో, పూతః = పవిత్రుడనై, ద్విజః+అస్మి = బ్రాహ్మణుడనైతిని, ఇతి = అని, గర్వం కరోతి = గర్విస్తున్నాడు, కః+అయమ్ = ఎవడు వీడు?, శూద్రః = శూద్రుడవై, శూద్రాత్ = శూద్రునికన్న, అనార్యతరః+అసి = పూజింపతగనివాడవు, నరకస్య = నరకానికి, పాన్థే (సతి) = బాటసారివై వుండి, ఏతైః = ఈ, వ్రతైః = వ్రతాలతో, కిమ్? = లాభమేమిటి?

తా : మ్లేచ్ఛుల పాదస్పర్శ అనే అమృతంతో పవిత్రుడనైనానని గర్విస్తున్న ఈ ద్విజుడెవడు? తాను శూద్రుని కన్న శూద్రుడై పూజనీయతను కోల్పోలేదా? నరకానికి బాటసారి అయినవానికి ఈ వ్రతాదులతో పని ఏమిటి?





శ్లో॥ ఉత్తిష్ఠ భో జాగృహి సర్జయాగ్నీన్
సాక్షాద్ధి తేజోఽసి పరస్య శౌరేః ।
వక్షఃస్థితేనైవ సనాతనేన
శత్రూన్ హుతాశేన దహన్నటస్వ ॥ 18

ప్ర : భోః! = ఓయీ!, ఉత్తిష్ఠ = లే!, జాగృహి = మేలుకో!, అగ్నీన్ = అగ్నులను, సర్జయ = వదలిపెట్టు, పరస్య = పరమాత్మ అయిన, శౌరేః = విష్ణువుయొక్క, సాక్షాత్-హి = ప్రత్యక్షంగానే, తేజః+అసి = తేజస్స్వరూపుడవు. వక్షః-స్థితేన = గుండెలపై నున్న, సనాతనేన = ప్రాచీనమైన, హుతాశేన = అగ్నితో, శత్రూన్ = శత్రువులను, దహన్ = జ్వలింపజేస్తూ, అటస్వ = తిరుగు/సంచరించు.

తా : ఓయీ! సనాతనా! లే! మేలుకో! నీ అగ్న్యారాధనను వదలిపెట్టు. పరమాత్మ యొక్క తేజస్సుకు నీవే రూపం. సనాతనమైన నీ గుండెలపై ఉన్న అగ్నిహోత్రంతో శత్రువులను దహిస్తూ, సంచరించు.





శ్లో॥ కః క్షత్రబన్ధుర్భవనేషు గూఢో
మద్యైః కటాక్షైశ్చ విలాసినీనామ్ ।
ధర్మాన్యశో దుర్బల! విస్మృతోఽసి
యుధ్యస్వ భో వఞ్చక! రక్ష ధర్మాన్ ॥ 19

ప్ర : కః = ఎటువంటి (ఏ), క్షత్ర–బన్ధుః = క్షత్రియాధముడు (నామమాత్రపు క్షత్రియుడు), మద్యైః = కల్లుతో, విలాసినీనామ్ = విలాసవతులైన స్త్రీలయొక్క, కటాక్షైః = కడగంటి చూపులతో, భవనేషు = రాజప్రాసాదాలలో, గూఢః (అస్తి) = దాగి ఉన్నాడు (వు)?, దుర్బల = బలహీనుడా!, ధర్మాన్ = ధర్మాన్ని, యశః = కీర్తినీ, విస్మృతః+అసి = మరచిపోయావు. భోః వంచక! = ఓయీ! మోసగాడా!, యుధ్యస్వ = పోరాడు, ధర్మాన్ = ధర్మాలను, రక్ష = కాపాడు.

తా : నామమాత్రపు క్షత్రియుడవై, మద్యపానంలో మునిగి, విలాసవతుల కటాక్షాలలో అంతఃపురంలో రహస్యంగా దాగి ఉన్నావు. నీ ధర్మాన్ని, నీ కీర్తినీ మరచిపోయావు. ఓరీ మోసగాడా! లేచి పోరాడు. ధర్మాన్ని కాపాడు.





**శ్లో॥ అస్త్యేవ లోహం నిశితశ్చ ఖడ్గః**
**క్రూరా శతఘ్నీ నదతీహ మత్తా ।**
**కథం నిరస్త్రోఽసి మృతోఽసి శేషే**
**రక్ష స్వజాతిం పరహా భవార్యః ॥ 20**

ప్ర : లోహమ్ = ఇనుము (తో చేసిన ఆయుధం), అస్తి+ఏవ = ఉండనే ఉంది. నిశితః = వాడి అయిన, ఖడ్గః చ = కత్తికూడా (ఉంది), క్రూరా = భీకరమైన, శతఘ్నీ చ = ఫిరంగి కూడా, మత్తా = మత్తెక్కి, ఇహ = ఇక్కడ, నదతి = ధ్వనిస్తోంది. నిరస్త్రః = నిరాయుధుడవై, కథమ్–అసి = ఎలా ఉన్నావు?, మృతః = మరణించినట్లుగా, కథమ్ అసి = ఎలా ఉన్నావు?, కథం శేషే = ఎలా పడుకొంటున్నావు?, స్వజాతిమ్ = నీ జాతిని, రక్ష = కాపాడు, పరహా = శత్రుసంహారకుడవై, ఆర్యః భవ = పూజనీయుడవు/ ఆర్యుడవు కమ్ము.

తా : ఇనుముతో చేసిన ఆయుధాలున్నాయి. వాడి అయిన కత్తి ఉంది. క్రూరమయిన ఫిరంగి మత్తెక్కి అరుస్తోంది. ఆయుధం పట్టకుండా ఎలా మనగలుగుతున్నావు? మృతకల్పుడవై ఎలా పడుకొంటున్నావు. నీ జాతిని కాపాడు. శత్రుసంహారం చేసి ఆర్యుడ వనిపించుకో!





**శ్లో॥ వైశ్యోఽసి కశ్చేహ విశః సమృద్ధ్యై**
**ధనం కిమేతద్విపణీషు సజ్జమ్ ।**
**మ్లేచ్ఛర్ద్ధిరేషా కురుషే దరిద్రాం**
**మామేవ కాలీం ఖల! మాతృద్రోహిన్! ॥ 21**

ప్ర : కః = ఎటువంటి, వైశ్యః అసి = వైశ్యుడవు?, ఇహ = ఇక్కడ, విశః = నగరం యొక్క/నగరమందలి జనులయొక్క, సమృద్ధ్యై = సమృద్ధికొరకు, విపణీషు = అంగడి వీథులలో, సజ్జమ్ = సిద్ధపరుపబడిన/పేర్చిన, ఏతత్ ధనమ్ = ఈ సంపద/ వస్తుసముదాయం, కిమ్? = ఏమిటి?, ఏషా = ఇది, మ్లేచ్ఛ+ఋద్ధిః = మ్లేచ్ఛుల సంపద. ఖల! = ఓ నీతిలేనివాడా!, మాతృ–ద్రోహిన్ = మాతృద్రోహీ, మామ్ కాలీమ్–ఏవ = నన్ను – కాళినే, దరిద్రామ్ = పేదరాలనుగా, కురుషే = చేస్తున్నావు.

తా : నీవేమి వైశ్యుడవు? పురసమృద్ధికొరకై అంగడివీథులను ధనంతో సిద్ధపరచి పెట్టావు. ఇదంతా మ్లేచ్ఛుల సంపద. నేను కాళిని. నన్నే పేదరాలను చేస్తున్నావు ఓ నీతిలేనివాడా! మాతృద్రోహీ!





శ్లో॥ మ్లేచ్ఛర్ద్ధిమేతాం జ్వలనాయ దేహి
రోషాగ్నినా కిం న బిభేషి కాల్యాః ।
దేవీం భవానీం హృది పూజయిత్వా
యతస్వ లక్ష్మ్యై భవ జన్మభూమ్యాః ॥ 22

ప్ర : ఏతామ్ = ఈ, మ్లేచ్ఛ+ఋద్ధిమ్ = మ్లేచ్ఛసంపదను, జ్వలనాయ = అగ్నికి, దేహి = ఆహుతి చెయ్. కాల్యాః = కాళియొక్క, రోష+అగ్నినా = క్రోధాగ్నితో, న బిభేషి కిమ్? = భయపడటం లేదా?, దేవీమ్ = దేవి అయిన, భవానీమ్ = భవానిని, హృది = మనస్సులో, పూజయిత్వా = అర్చించి, జన్మ–భూమ్యాః = జన్మభూమియొక్క, లక్ష్మ్యై = సంపత్తికై, యతస్వ = ప్రయత్నించు, భవ = నిలు.

తా : ఈ మ్లేచ్ఛసంపదను తగులబెట్టు. నా రోషాగ్నికి నీవు భయపడటం లేదా? భవానీదేవిని మనస్సులో సమర్చించి మాతృభూమి సమృద్ధికై ప్రయత్నించు. దృఢంగా నిలు.





**శ్లో॥ భో భో అవన్త్యో మగధాశ్చ వఙ్గా**
**అఙ్గాః! కళిఙ్గాః! కురుసిన్ధవశ్చ ।**
**భో దాక్షిణాత్యాః! శృణుతాన్ధ్రచోలా**
**వసన్తి యే పఞ్చనదేషు శూరాః ॥ 23**

ప్ర : భోః అవన్త్యః = ఓ అవన్తీ దేశీయులారా!, మగధాః చ = మాగధులారా!, వంగాః = వంగదేశస్థులారా!, కళింగాః = కాళింగులారా!, కురుసిన్ధవః+చ = కురుదేశవాసులారా!, సింధుప్రజలారా!, భోః దాక్షిణాత్యాః = ఓ దాక్షిణాత్యులారా!, ఆన్ధ్ర-చోళాః = ఆంధ్రులారా!, చోళులారా!, పంచ-నదేషు = అయిదు నదులు ప్రవహించే ఈ భారత భూమిలో, యే శూరాః = ఏ శూరులు, వసంతి = నివసిస్తున్నారో - వారూ, శృణుత = వినండి.

తా : అవంతీదేశస్థులారా! మాగధులారా! వంగదేశీయులారా! అంగదేశస్థులారా! కాళింగులారా! కురుదేశీయులారా! సింధుదేశస్థులారా! దాక్షిణాత్యులైన ఆంధ్ర చోళులారా! పంచనదదేశపౌరులారా! వినండి.





శ్లో॥ యే కే త్రిమూర్తిం భజథైకమీశం
యే చైకమూర్తిం యవనా మదీయాః ।
మాతాఽహ్వాయే వస్తనయాన్వి సర్వాన్
నిద్రాం విముఞ్చధ్వమయే! శృణుధ్వమ్ ॥ 24

ప్ర : యే కే = ఎవరయితే, ఏకమ్ = ఒక్కడైన, ఈశమ్ = పరమాత్మను, త్రి-మూర్తిమ్ = మూడు రూపాలు (బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు)గలవానినిగా, భజథ = సేవిస్తున్నారో, యే చ = ఎవరయితే, మదీయాః = నా వారైన, యవనాః = యవనులు, ఏక-మూర్తిమ్ = ఏకస్వరూపునిగా, భజథ = సేవిస్తున్నారో- అటువంటి, తనయాన్ = నా బిడ్డలైన, వః సర్వాన్ = మీ అందరనూ, మాతా = తల్లినైన నేను, అహ్వాయే = పిలుస్తున్నాను, అయే = ఓ బిడ్డలారా!, నిద్రామ్ = నిద్రను, విముంచధ్వమ్ = వదలండి, శృణుధ్వమ్ = వినండి.

తా : బిడ్డలారా! తల్లిగా ఆహ్వానిస్తున్నాను. మీలో కొందరు ఏకరూపుడైన పరాత్పరుని త్రిమూర్తి స్వరూపునిగా ఆరాధిస్తున్నారు. నావారే కొందరు యవనులు ఏకస్వరూపునిగా ఆరాధిస్తున్నారు. అందరూ నా బిడ్డలే. లేవండి. నా మాటలు వినండి.





శ్లో॥ కాలస్య భేరీం శృణుతాద్రిశృఙ్గే
రౌద్రం కృతాన్తం మమ దూతరూపమ్ ।
దుర్భిక్షమేతానథ భూమికమ్పాన్
నిబోధతాధీశతమాఽఽగతాఽస్మి ॥ 25

ప్ర : అద్రి–శృంగే = కొండ శిఖరం మీద (వినిపిస్తున్న), కాలస్య = కాలంయొక్క, భేరీమ్ = భేరిని, శృణుత = వినండి. మమ = నాయొక్క, దూత–రూపమ్ = దూతరూపంలో వున్న, రౌద్రమ్ = భీకరమైన, కృతాన్తమ్ = యముని గూర్చి (తెలుసుకో). ఏతాన్ = ఈ, భూమి–కంపాన్ = భూకంపాలను గూర్చి, అథ = ఆపై, దుర్భిక్షమ్ = దుర్భిక్షాన్ని గూర్చి (తెలుసుకో). అధీశతమా = అంతటికీ ఈశ్వరినైన నేను, ఆగతా+అస్మి = వచ్చానని, నిబోధత = తెలుసుకో.

తా : కొండల శిఖరాల నుండి వినిపిస్తున్న మృత్యుభేరిని వినండి. భీకరమైన ఆ మృత్యువు నా దూతగా వస్తోంది. ఈ భూకంపాలనూ, ఈ దుర్భిక్షాన్నీ చూసి అయినా జగదధీశ్వరినైన నా రాకను గుర్తించి తెలుసుకోండి.





శ్లో॥ దేహి క్రతూన్దేహి పిపాసురస్మి
జానీహి దృష్ట్వా భజ శక్తిమాద్యామ్ ।
శిరాంసి రాజ్ఞాం మహతాం తనూశ్చ
భోక్తుం నదన్తీ చరతీహ కాలీ ॥ **26**

ప్ర : క్రతూన్ = యా(త్యా)గాలను, దేహి దేహి = విరివిగా ఇవ్వండి (చేయండి). (అహమ్ = నేను), పిపాసుః + అస్మి = దప్పికగొని ఉన్నాను. దృష్ట్వా = చూసి, ఆద్యాం శక్తిమ్ = (నన్ను) ఆదిశక్తినిగా, జానీహి = తెలుసుకో. భజ = అర్చించు. రాజ్ఞామ్ = రాజులయొక్క, శిరాంసి = తలలను, మహతామ్ = మహాత్ములయొక్క, తనూశ్చ = శరీరాలను, భోక్తుమ్ = కబళించటానికి, నదన్తీ = ఆక్రోశిస్తూ, కాలీ = కాళికాదేవి, ఇహ = ఇక్కడ, చరతి = తిరుగుతోంది.

తా : యాగాలను చేయండి. నేను దప్పికతో ఉన్నాను. నన్ను చూసి ఆదిశక్తినిగా గ్రహించి అర్చించండి. రాజుల తలలనూ, పెద్ద శరీరాలనూ కబళించటానికి నేను – కాళికాదేవిని – గర్జిస్తూ తిరుగుతున్నాను.





**శ్లో॥ రక్తప్రవాహైరపి నాస్మి తృప్తా**
**శతైస్సహస్రైరయుతైరజానామ్ ।**
**ప్రదత్త భిత్త్వా హృదయాని రక్తం**
**సమ్పూజయన్త్యేవమజాం కరాలీమ్ ॥ 27**

ప్ర : శతైః = వందలు, సహస్రైః = వేలు, అయుతైః = అయుతాలు (పదివేలు) అయిన, అజానామ్ = మేక(గొఱ్ఱె) పోతుల యొక్క, రక్త–ప్రవాహైః+అపి = నెత్తుటి ప్రవాహాలచేత కూడా, అహమ్ = నేను, తృప్తా = తృప్తిపడినదాననుగా, న+అస్మి = లేను. హృదయాని = గుండెలను, భిత్త్వా = చీల్చి, రక్తమ్ = నెత్తుటిని, ప్రదత్త = ఇవ్వండి. ఏవమ్ = ఈ రీతిగా, కరాలీమ్ = భీకర అయిన, అజామ్ = అనాదిశక్తిని, పూజయన్తి = పూజిస్తారు.

తా : మీరు వందలూ, వేలూ, అయుతాలూ సంఖ్యకొద్దీ మేక (గొఱ్ఱె) పోతుల రక్తప్రవాహాలను అర్పించినా నాకు తృప్తి లేదు. (మీ) హృదయాలను చీల్చి రక్తతర్పణం చేయండి. అనాది అయిన భీకర కాళిని అలాగే పూజిస్తారు.





శ్లో॥ యేషాం సదైవాత్మబలిప్రవృత్తా-
శ్శూరా మహాన్తః ప్రముఖాః కులార్థే ।
సౌమ్యా కరాలీ భవతి ప్రజానాం
రక్తేన పుష్టా వినిహన్తి శత్రూన్ ॥ 28

ప్ర : యేషామ్ = ఎవరిలో, కుల+అర్థే = జాతికొరకు, సదా–ఏవ = ఎల్లప్పుడూ, శూరాః = శూరులూ, మహాన్తః = శ్రేష్ఠులూ, ప్రముఖాః = ముఖ్యులూ, ఆత్మ–బలి–ప్రవృత్తాః : ఆత్మ–బలి = ఆత్మత్యాగమందు, ప్రవృత్తాః = సన్నద్ధులై (ఉంటారో), (తేషాం) ప్రజానామ్ = ఆ జనులకు, కరాలీ = భీకర అయిన కాళి, సౌమ్యా భవతి = ప్రసన్నంగా ఉంటుంది. రక్తేన = (బలి) రక్తంతో, పుష్టా = పెరిగి (వృద్ధినంది), శత్రూన్ = శత్రువులను, వినిహన్తి = హింసిస్తుంది.

తా : ఏ జాతిలో శూరులూ, మహాత్ములూ, ప్రముఖులూ తమ జాతికోసం సర్వదా ఆత్మబలిదానానికి సిద్ధపడి వుంటారో అటువంటి వారికి కాళి సౌమ్యంగా కనిపిస్తుంది. రక్తపానంతో వర్ధిల్లి శత్రువులను హింసిస్తుంది.





**శ్లో॥ కం బిభ్యతార్యా రుధిరస్య సిన్ధౌ**
**నిమజ్జతాస్మిన్ భవతార్యసత్త్వాః ।**
**త్రిశూలి భోః! పశ్యత తత్ర పారే**
**జ్యోతిర్హ్యుదేతీదమభిన్నతేజః ॥ 29**

ప్ర : ఆర్యాః = ఆర్యులారా!, కమ్ = దేనిని గూర్చి, బిభ్యత = భయపడుతున్నారు?, అస్మిన్ = ఈ, రుధిరస్య = నెత్తుటియొక్క, సిన్ధౌ = సముద్రమందు, నిమజ్జత = మునగండి. ఆర్య–సత్త్వాః = ఆర్యబలం గలవారుగా, భవత = కండి!, భోః = ఓ ఆర్యులారా!, తత్ర = అక్కడ, పారే = ఆవలి ఒడ్డున, అభిన్న–తేజః = తేజోభంగం లేనిదై, త్రిశూలి = త్రిశూలంగల, ఇదమ్ = ఈ, జ్యోతిః = వెలుగు, ఉదేతి హి = ఉద్భవిస్తోంది గదా!, పశ్యత = చూడండి.

తా : ఆర్యులారా! దేనికి భయపడుతున్నారు? రక్తసముద్రంలో మునగండి. నిజమైన ఆర్యశక్తి సంపన్నులు కండి. అటు ఆవలివైపు త్రిశూలాన్ని ధరించి అభంగతేజస్సుతో జ్యోతి ఉద్భవిస్తోంది.





శ్లో॥ కవే! విలాసిన్! శృణు మాతృవాక్యం
కాలీం కరాలీం భజ పుత్త్ర! చణ్డీమ్ ।
ద్రష్టాఽసి వై భారతమాతరం తాం
ఘ్నతీమరాతీన్ భృశమాజిమధ్యే ॥ 30

ప్ర : విలాసిన్ = విలాసవంతుడవైన, కవే = కవీ!, మాతృ–వాక్యమ్ = తల్లి మాటను, శృణు = విను, పుత్ర = కుమారా!, కరాలీమ్ = భీకరమైనదీ, చండీమ్ = కోపంగలదీ అయిన, కాళీమ్ = కాళిని, భజ = సేవించు, ఆజి–మధ్యే = రణరంగంలో, అరాతీన్ = శత్రువులను, భృశమ్ = మిక్కిలిగా, ఘ్నతీమ్ = చంపుతున్న, తామ్ = ఆ, భారత–మాతరమ్ = భారతమాతను, ద్రష్టా – అసి = చూడగలవు.

తా : విలాసంగా జీవించే కవీ! తల్లి మాట విను. నాయనా! భీకరంగా శత్రువులను చెండాడుతున్న కాళిని సేవించు. రణరంగంలో తీవ్రంగా శత్రుసంహారం చేస్తున్న భరతమాతను చూడగలవు.





**శ్లో॥ సనాతనాన్యాహ్వాయ భారతానాం**
**కులాని యుద్ధాయ జయోఽస్తు మా భైః ।**
**భో జాగృతాఽస్మి క్వ ధనుః క్వ ఖడ్గ**
**ఉత్తిష్ఠతోత్తిష్ఠత సుప్తసింహాః! ॥ 31**

ప్ర : సనాతనాని = ప్రాచీనాలయిన, భారతానామ్ = భారతీయులయొక్క, కులాని = జాతులను, యుద్ధాయ = యుద్ధానికి, ఆహ్వాయ = పిలు. జయః+అస్తు = గెలుపు కలుగు గాక, మా భైః = భయపడవద్దు, భోః = ఓయీ!, జాగృతా+అస్మి = మేలుకొన్నాను, ధనుః = విల్లు, క్వ = ఎక్కడ?, ఖడ్గః = కత్తి, క్వ = ఎక్కడ?, సుప్త-సింహాః = నిదురుస్తున్న సింహాలలారా!, ఉత్తిష్ఠత ఉత్తిష్ఠత = లేవండి, లేవండి.

తా : సనాతనభారతీయజాతుల నన్నింటినీ యుద్ధానికి ఆహ్వానించండి. మీకు గెలుపు గలుగుతుంది. భయపడవద్దు. నేను మేల్కొన్నాను. విల్లేది? కత్తి ఏది? నిదురిస్తున్న సింహాలలారా! లేవండి, లేవండి.





శ్లో॥ ఇమాని వాక్యాని నిశమ్య రాత్రౌ
తేజశ్చ భీమం తిమిరే విలోక్య ।
చిత్తం ననర్తాశు విహాయ సద్మ
భోగాన్వినిర్ధూయ చ నిర్జగామ ॥ 32

ప్ర : ఇమాని = ఈ, వాక్యాని = పలుకులను, నిశమ్య = విని, రాత్రౌ = రేయి, తిమిరే = చీకటిలో, భీమమ్ = భయంకరమైన, తేజః = తేజస్సును, విలోక్య చ = చూసీ, చిత్తమ్ = మనస్సు, ననర్త = నృత్యం చేసింది. ఆశు = వెంటనే, సద్మ = భవనాన్ని, విహాయ = వీడి, భోగాన్ = సుఖానుభవాలను, వినిర్ధూయ చ = కాలదన్ని, నిర్జగామ = బయటకు నడిచాను.

తా : ఈ మాటలు ఆ రాత్రి అంధకారంలో తిగ్మతేజస్సును చూసి నా మనస్సు నృత్యం చేసింది. వెంటనే ఇంటిని వదలి, భోగాలను పరిత్యజించి బయటకు నడిచాను.





శ్లో॥ సాన్ద్రం తమిస్రావృతమార్తమన్ధం
దదర్శ తద్భారతమార్యఖణ్డమ్ ।
గూఢా రజన్యామరిభిర్వినష్టా
మాతా భృశం క్రన్దతి భారతానామ్ ॥ 33

ప్ర : సాంద్రమ్ = నిబిడంగా, తమిస్రా–ఆవృతమ్ : తమిస్రా = గాఢాంధకారంతో, ఆవృతమ్ = చుట్టబడినదీ, ఆర్తమ్ = దీనమైనదీ, అన్ధమ్ = కబోది అయినదీ, ఆర్య–ఖండమ్ = ఆర్యభూమి అయిన, తత్ = ఆ, భారతమ్ = భారతదేశాన్ని, దదర్శ = చూశాను. రజన్యామ్ = రాత్రియందు, గూఢా = మాటువడినదీ, అరిభిః = శత్రువులచే, వినష్టా = నశింపజేయబడినదీ, అయిన, భారతానామ్ = భారతీయులయొక్క, మాతా = తల్లి, భృశమ్ = మిక్కిలిగా, క్రందతి = ఆక్రోశిస్తోంది.

తా : తాను ఆర్యభూమి అయిన భారతదేశాన్ని చూశాడు. అది గాఢాంధకారంచేత కప్పబడి, సాంద్రంగా, దీనంగా, కబోదిలా కనిపిస్తోంది. రాత్రి మాటుగా దాగినదై శత్రువులచే అదృశ్యం చేయబడిన ఆ భారతమాత ఎంతో విలపిస్తోంది.





శ్లో॥ స భ్రామయామాస దృశం రజన్యాం
భ్రాతౄన్ స తప్తస్తిమిరే విచిన్వన్ ।
కఙ్కాలసారాణి దదర్శ తాని
శవాని తేషాం కరుణాని భూమౌ ॥ 34

ప్ర : సః = ఆ నేను, రజన్యామ్ = రాత్రిలో, దృశమ్ = చూపును, భ్రామయామాస = (నలువైపులా) త్రిప్పాను. తప్తః = తపించిపోతున్న, సః = ఆ నేను, తిమిరే = చీకటిలో, భ్రాతౄన్ = సోదరులను, విచిన్వన్ = వెదకుతూ, భూమౌ = నేలపై, కరుణాని = దయనీయమైన, తేషామ్ = ఆ సోదరులయొక్క, కంకల–సారాణి = అస్థిపంజరాలే మిగిలిన, శవాని = శవాలను, దదర్శ = చూశాను.

తా : ఆ నిశీథిలో నా చూపు నలువైపులా త్రిప్పాను. బాధతో నా సోదరులకై ఆ చీకటిలో అన్వేషిస్తూ, దయనీయస్థితిలో అస్థిపంజరాలే మిగిలిన వారి శవాలను నేలపై చూశాను.





శ్లో॥ తదా దదర్శాసురమేకమీశం
కిరీటినం వజ్రధరం మహాన్తమ్ ।
అశ్రూణి రక్తౌఘశతాని మాతుః
సఙ్గృహ్య పుష్ణన్తమపత్యసఙ్ఘాన్ ॥ 35

ప్ర : తదా = అప్పుడు, మాతుః = తల్లియొక్క, అశ్రూణి = కన్నీటినీ, రక్త+ఓఘ-శతాని = వందల కొలదిగా నెత్తుటి ప్రవాహాలనూ, సంగృహ్య = స్వీకరించి, అపత్య-సంఘాన్ = తన సంతానసమూహాలను, పుష్ణన్తమ్ = పెంచుతున్నవాడూ, వజ్రధరమ్ = వజ్రధారీ, కిరీటినమ్ = కిరీటధారీ, ఈశమ్ = ప్రభువూ అయిన, ఏకమ్ = ఒక, మహాన్తమ్ = గొప్ప, అసురమ్ = రాక్షసుని, దదర్శ = చూశాను.

తా : అప్పుడు తల్లి (భారతభూమి) కన్నీటితోనూ, నెత్తుటి ప్రవాహాలతోనూ తన సంతానసమూహాలను పెంచుతున్న ఒక గొప్ప రాక్షసుని చూశాను. ఆ రాక్షసుడు వజ్రాన్నీ, కిరీటాన్నీ ధరించిన పాలకుడు.





శ్లో॥ పదా తుషారాద్రిమదీనసత్త్వం
మృద్నన్తమన్ధ్రానితరేణ పౌణ్డ్రాన్ ।
ప్రసారయన్తం కరవాలముగ్రం
చీనావనౌ పహ్లవభూమిఖణ్డే ॥ 36

ప్ర : పదా = (ఒక) కాలితో, అదీన-సత్త్వమ్ = బెదరని బలం (జంతువులు) గల, తుషార+అద్రిమ్ = హిమవత్పర్వతాన్ని, ఇతరేణ = మరొక కాలితో, అన్ధ్రాన్ = ఆంధ్రులను, పౌండ్రాన్ = పౌండ్రులనూ, మృద్నన్తమ్ = మర్దిస్తున్నవాడూ, చీన+అవనౌ = చైనాభూమిపై, పహ్లవ-భూమిఖండే = పారశీకభూభాగం మీదనూ, ఉగ్రమ్ = భీకర (క్రూర)మైన, కరవాలమ్ = కత్తిని, ప్రసారయన్తమ్ = ప్రసరింపజేస్తున్న వాడూ అయిన (అసురుని చూశాను).

తా : ఒక పాదంతో దృఢమైన బలంగల హిమాద్రినీ, మరొక పాదంతో ఆంధ్రులనూ, పౌండ్రులనూ అణచివేస్తూ; చైనా ప్రాంతంలోనూ, పారశీక భూభాగాలలోనూ భీకర కరవాలాలను ప్రసరింపజేస్తున్న అసురుని చూశాను. (దేశమంతా తన ప్రతాపాన్ని ప్రదర్శిస్తున్నాడని కవి ఆవేదన).





శ్లో॥ ఖలం విశాలం బలగర్వితం తం
ధర్మేణ దృప్యన్తమధర్మబుద్ధిమ్ ।
దృష్ట్వా త్వభూచ్చిత్తమివాగ్నికుణ్డం
క్రోధేన జజ్వాల హి శాశ్వతేన ॥ 37

ప్ర : ఖలమ్ = చెడ్డవాడూ, విశాలమ్ = పెద్దవాడూ, బల–గర్వితమ్ = బలంతో గర్వించినవాడూ, అధర్మ–బుద్ధిమ్ = అధర్మంపై బుద్ధిగలవాడూ, ధర్మేణ = ధర్మకారణంగా, ధర్మమన్నభావనతో, దృప్యన్తమ్ = గర్విస్తున్నవాడూ అయిన, తమ్ = ఆ అసురుని, దృష్ట్వా = చూసి, చిత్తమ్ = మనస్సు, అగ్ని–కుండమ్ ఇవ = అగ్నిగుండంలాగా, అభూత్ = అయ్యెను. శాశ్వతేన = స్థిరమైన, క్రోధేన = కోపంతో, జజ్వాల హి = మండిపోయింది గదా!

**తా :** తనకు కనిపించిన ఆ రాక్షసుడు పెద్దవాడు. దుర్మార్గుడు. బలగర్వితుడు. అధర్మపరుడు. కానీ ధర్మపరుడుగా ప్రగల్భించేవాడు. ఆ అసురుని చూడగానే హృదయం అగ్నిగుండమైంది. ఆరని కోపంతో మండిపోయింది.





శ్లో॥ కులాని సుప్తాని సనాతనాని
హ్వాతుం జగౌ జాగరణాయ భీమా ।
క్రూరం విరావౌఘముదీరయన్తీ
పార్శ్వే మమాయాద్రజనీవ ఘోరా ॥ 38

ప్ర : భీమా = భయంకరమైన ఆమె, సుప్తాని = నిదురలో వున్న, సనాతనాని = ప్రాచీనాలయిన, కులాని = జాతులను (జాతులకు చెందిన మనుష్యులను), జాగరణాయ = మేల్కొల్పడానికై, హ్వాతుమ్ = పిలవటానికి, జగౌ = శబ్దించింది. క్రూరమ్ = దయలేని, విరావ+ఓఘమ్ = ఆక్రందనల పరంపరను, ఉదీరయన్తీ = పలుకుతూ, ఘోరా = భీకరమైన, రజనీ ఇవ = రాత్రివలె, మమ = నా యొక్క, పార్శ్వే = ప్రక్కకు, ఆయాత్ = వచ్చింది.

తా : ఆమె నిదురలో మునిగిన ఈ సనాతనభారతీయజాతులను మేల్కొలపటానికి పిలుస్తున్నట్లు భీకరంగా ఆక్రందించింది. దయలేని ఆక్రోశపరంపరలతో భీకరమైన రాత్రిలాగా నా ప్రక్కకు చేరింది.





శ్లో॥ భీమైః కరాలైర్ధరణీ వచోభి-
శ్చచాల సిన్ధుశ్చ నభో జగర్జ ।
భీమైః సరోషైశ్చ విలోకనైస్తై-
ర్బ్రహ్మాణ్డముత్తప్తమివాగ్నివృష్ట్యా ॥ 39

ప్ర : భీమైః = భీకరమయినవీ, కరాలైః = హెచ్చుతగ్గులు గలవీ అయిన, వచోభిః = మాటలతో, ధరణీ = భూమి, సిన్ధుః చ = సముద్రమూ కూడా, చచాల = కదిలింది. నభః = ఆకాశం, జగర్జ = గర్జించింది. సరోషైః = కోపంతో కూడినవీ, భీమైః = భయంకరమైనవీ అయిన, తైః = ఆ, విలోకనైః = చూపులతో, బ్రహ్మాండమ్ = బ్రహ్మాండం, అగ్నివృష్ట్యా = నిప్పులవానతో, ఉత్తప్తమ్ ఇవ = తపించినట్లు, (అభూత్ = ఆయెను).

**తా :** స్వరంలో హెచ్చుతగ్గులతో భీకరంగా ఉన్న ఆ మాటలతో భూమీ, సముద్రమూ చలించాయి. కోపంతో కూడి బెదరుపుట్టించే ఆ చూపులతో బ్రహ్మాండమంతా నిప్పులవాన కురిసినట్లు తపించింది.





శ్లో॥ త్రైలోక్యమున్మాదకరైః కరాల్యా
ఆవాహనైః పూర్ణమభూచ్చ సర్వమ్ ।
జ్వాలాముఖీ దారుణవహ్నిగర్భా
కణ్ఠాదుదక్రామదజస్రశబ్దా ॥ 40

ప్ర : ఉన్మాద–కరైః = పిచ్చెక్కించెడి, కరాళ్యాః = ఆ భీకరకాళియొక్క, ఆవాహనైః = పిలుపులతో, త్రైలోక్యమ్ = మూడులోకాల, సర్వమ్ = మొత్తమూ, పూర్ణమ్ అభూత్ = నిండిపోయింది. దారుణ–వహ్ని–గర్భా : దారుణ = భయంకరమైన, వహ్ని = అగ్ని, గర్భా = లోనగలదీ, అజస్ర–శబ్దా = ఎడతెగని ధ్వనిగలదీ అయిన, జ్వాలాముఖీ = లావా, కంఠాత్ = గొంతునుండి, ఉదక్రామత్ = పైకి చిమ్మింది.

**తా :** ఉన్మాదాన్ని కల్గించే ఆ భీకరావాహనలతో మూడులోకాలూ పూర్తిగా నిండిపోయాయి. నిరంతరధ్వనితో, అగ్నిని తనలో నింపుకొన్న లావా ఆ కంఠం నుండి పైకి చిమ్మింది.





శ్లో॥ క్షోభేణ తీవ్రేణ చరాచరస్య
క్షుబ్ధాన్యపశ్యం పృతనాని తత్ర ।
స్వప్నోత్థితానీవ వచః సురౌద్రం
భో హన్యతాం దుష్ట ఇతీరయన్తి ॥ 41

ప్ర : తత్ర = అక్కడ, చర+అచరస్య = స్థావరజంగమములయొక్క, తీవ్రేణ = మిక్కుటమైన, క్షోభేణ = కలతతో, పృతనాని = సేనలను, స్వప్న+ఉత్థితాని ఇవ = నిదురనుండి మేల్కొనినట్లుగా, క్షుబ్ధాని = వ్యాకులమైనవానిగా, అపశ్యమ్ = చూసితిని. భోః = ఓయీ!, దుష్టః = దుర్మార్గుడు, హన్యతామ్ = చంపబడుగాక, ఇతి = అని (ఆ సేనలు), సురౌద్రమ్ = మిక్కిలి తీక్ష్ణమైన వచః = మాటను, ఈరయన్తి = పలుకుతున్నాయి.

**తా :** చరాచరప్రపంచానికి తీవ్రమైన క్షోభగలగటంతో అక్కడి సేనలన్నీ కూడా నిదురనుండి హఠాత్తుగా లేచినట్లు కలతపడ్డాయి. 'ఆ దుష్టుని చంపండి' అన్న రౌద్రవచనాలు పలుకసాగాయి.





**శ్లో॥ జ్ఞాత్వా హి మాతూ రుదితం క్షతాని**
**విద్యుద్ధరాణ్యక్షిశతాన్యభూవన్ ।**
**క్రోధైస్సహస్రాణి తతో ముఖాని**
**భీమాని భీమం దనుజేశమాయన్ ॥ 42**

**ప్ర :** మాతుః = తల్లియొక్క, రుదితమ్ = ఏడుపును, క్షతాని = గాయాలను, జ్ఞాత్వా = తెలిసికొని, అక్షి–శతాని = వందలకళ్ళు, విద్యుత్+హరాణి : విద్యుత్ = మెరుపుచే, హరాణి = కోల్పోయినవిగా (మిరుమిట్లు గలవిగా), అభూవన్ హి = అయ్యాయి. తతః = అప్పుడు (దానితో), సహస్రాణి ముఖాణి = వేల ముఖాలు, క్రోధైః = కోపాలతో, భీమాని (సన్తి) = భీకరాలై, భీమమ్ = భీకరుడైన, దనుజ+ఈశమ్ = రాక్షస ప్రభువును, ఆయన్ = తాకినవి.

**తా :** తల్లి ఆక్రందనలనూ, ఆమెకు కలిగిన గాయాలను గురించి తెలిసికొని, వందల కళ్ళు మెరుపుతాకిడితో మూతబడినట్లయ్యాయి. ఆపై వేల ముఖాలు క్రోధంతో భయంకరాలై భీకరుడైన ఆ రాక్షసప్రభువు వైపు తిరిగాయి.





**శ్లో॥ సుప్తేషు పుత్త్రేషు రణోత్సుకేషు**
**నిశాచరః శోణితమార్యమాతుః ।**
**పిబన్వినర్దస్యబలాన్ బలీ కో**
**విహంసి చాణ్డాల! కృతాన్తభక్ష్య! ॥ 43**

ప్ర : రణ+ఉత్సుకేషు = యుద్ధోత్సాహం గల, పుత్త్రేషు = బిడ్డలు, సుప్తేషు = నిదురలో వుండగా, నిశాచరః (సన్) = రాక్షసుడవై, ఆర్య–మాతుః = ఆర్యజనని యొక్క, శోణితమ్ = నెత్తుటిని, పిబన్ = త్రాగుతూ, వినర్దసి = రంకెలు వేస్తున్నావు. చాండాల! = చాండాలుడా!, కృతాంత–భక్ష్య = యమాహారమా! (యముడు తినదగినవాడా/ యమునికి ఆహారమైనవాడా!), అబలాన్ = బలహీనులను, విహంసి = బాధిస్తున్నావు, కః బలీ? = ఏం బలవంతుడవు?

తా : రణోత్సాహంతో పోరాడవలసిన బిడ్డలు నిదురిస్తుంటే నీవు నిశాచరుడవై ఆర్యజనని నెత్తుటిని త్రాగుతూ రంకెలు వేస్తున్నావు. చండాలా! నీవు యముడికి ఎరవు. బలహీనులను పీడిస్తున్న నువ్వేం బలవంతుడివి.





**శ్లో॥ ఇతీరయన్తీ వచనాని రుష్టా**
**శస్త్రం గృహీత్వా ధనురగ్నిగర్భమ్ ।**
**అభ్యద్రవద్భీమమరాతిముగ్రా**
**పశ్చాత్పురస్తాచ్చ జగర్జ కాలీ ॥ 44**

ప్ర : ఇతి = ఈ రీతిగా, ఈరయన్తీ = పలుకుతూ, రుష్టా = కోపించినదై (ఆమె), శస్త్రమ్ = ఆయుధాన్నీ, అగ్ని–గర్భమ్ = నిప్పు లోగల, ధనుః = వింటినీ, గృహీత్వా = తీసికొని, ఉగ్రా (సతీ) = రోషం ప్రదర్శిస్తూ, భీమమ్ = భయంకరుడైన, అరాతిమ్ = శత్రువును, అభ్యద్రవత్ = ఎదిరించింది (శత్రువు మీదకు వెళ్ళింది). పశ్చాత్ = వెనుకా, పురస్తాత్ చ = ముందూ కూడా, కాలీ = కాళి, జగర్జ = గర్జించింది.

తా : అలా మాటాడుతూ కోపంతో ఆయుధాన్నీ, అగ్నిగర్భమైన ఒక వింటినీ చేతబట్టి ఉగ్రంగా భీకరుడైన ఆ శత్రువుపైకి ఉరికింది. కాళి ముందూ, వెనుకా గర్జించింది.





శ్లో॥ జ్వాలాకరాలా ధరణీ బభూవ
క్రోధైర్జ్వలద్భిర్గగనఞ్చ తూర్ణైః ।
హ్రేషారవైర్దున్దుభినాఞ్చ నాదై-
స్త్రస్తా ధరాభూద్ దనుజస్య యుద్ధే ॥ 45

**ప్ర :** దనుజస్య = రాక్షసునియొక్క, యుద్ధే = యుద్ధంలో, ధరణీ = నేల, జ్వాలా-కరాలా : జ్వాలా = మంటలతో, కరాళా = భీకరంగా, బభూవ = అయింది. గగనం చ = ఆకాశం కూడా, తూర్ణైః = వేగం గల, జ్వలద్భిః = మండుతున్న, క్రోధైః = కోపాలతో (అరుపులతో), కరాళా బభూవ = భీకరమైంది. హ్రేషా-రవైః = (గుఱ్ఱపు) సకిలింతలతో, దుందుభినామ్ = దుందుభులయొక్క, నాదైః చ = ధ్వనులతో, ధరా = భూమి (భూమి మీది జనం), త్రస్తా+అభూద్ = బెదిరిపోయింది.

**తా :** ఆ రాక్షసయుద్ధంలో మంటలతో నేల భయంకరంగా తయారైంది. మండిపడే కోపంతో వేగంగా ఎగుస్తున్న అరుపులతో ఆకాశం భీకరమైంది. గుఱ్ఱాల సకిలింతలతో, దుందుభినాదాలతో విశ్వమంతా బెదిరిపోయింది.





శ్లో॥ రక్తాక్తమేఘా నభసీవ తేపుః
పపాత చోర్వ్యాం రుధిరోగ్రవృష్టిః ।
రక్తోదధౌ రేజిర అద్రిసఙ్ఘా
వసున్ధరా రక్తమయీ బభాసే ॥ 46

ప్ర : రక్త+అక్త–మేఘాః : రక్త = నెత్తుటితో, అక్త = పూయబడిన, మేఘాః = మేఘాలు, నభసి = ఆకాశమందు, తేపుః ఇవ = మండుతున్నట్టు కనిపించాయి. ఉర్వ్యామ్ = నేలపై, రుధిర+ఉగ్ర–వృష్టిః : రుధిర = నెత్తుటియొక్క, ఉగ్ర–వృష్టిః = పెనువాన, పపాత చ = కురిసింది (పడింది). అద్రి–సంఘాః = కొండల పిండులు, రక్త+ఉదధౌ = నెత్తుటి కడలిలో, రేజిరే = ప్రకాశించాయి. వసున్ధరా = భూమి, రక్తమయీ = రక్తరూపమై, బభాసే = ప్రకాశించింది.

**తా :** నెత్తురుపూసిన మేఘాలు గగనంలో మండుతున్నట్లు కనిపించాయి. తీవ్రరక్తవృష్టి నేలపై కురిసింది. కొండల గుంపులు నెత్తుటి కడలిలో ప్రకాశించాయి. వసుంధర రక్తమయమై దీపించింది.





శ్లో॥ భీమో రజన్యామసురో బలీయాన్
మమర్ద సైన్యాని సురప్రియాణామ్ ।
జగర్జ చోన్మత్తమనాః సురారిః
కో మే సమః పుంస్వితి రూఢగర్వః ॥ 47

ప్ర : భీమః = భయంకరుడూ, బలీయాన్ = బలవంతుడూ అయిన, అసురః = రాక్షసుడు, రజన్యామ్ = రాతిరిలో, సుర–ప్రియాణామ్ = దేవతలకిష్టులైన వారియొక్క, సైన్యాని = సేనలను, మమర్ద = అణిచివేశాడు. ఉన్మత్త–మనాః = మత్తెక్కిన మనస్సు గలవాడూ, రూఢ–గర్వః = పాతుకుపోయిన పొగరు గలవాడూ అయిన, సుర+అరిః = దేవశత్రువు/ రాక్షసుడు, పుంసు = పురుషులలో, మే = నాకు, సమః = సమానుడు, కః ఇతి = ఎవరని, జగర్జ చ = గర్జించాడు కూడా!

**తా :** భీకరుడూ, బలవంతుడూ అయిన ఆ రాక్షసుడు దేవతాప్రియుల సేనలను అణచివేశాడు. అంతేకాదు. మదించిన మనస్సుతో పొగరెక్కి మగవారిలో నాతో సమానుడెవ్వడని గర్జించాడు కూడా.





శ్లో॥ తదా తమిస్రామపసారయన్తం
రక్తప్రకాశం దివి బాలసూర్యమ్ ।
శరోపమైర్ఘ్నన్తమివాంశుభిస్తం
ప్రీతో దదర్శాహముదగ్రరశ్మిమ్ ॥ 48

**ప్ర :** తదా = అప్పుడు, తమిస్రామ్ = రేయిని, అపసారయన్తమ్ = తొలగిస్తున్నవాడూ, దివి = ఆకాశంలో, రక్త–ప్రకాశమ్ = ఎఱ్ఱగా వెలుగుతున్న వాడూ, ఉదగ్ర–రశ్మిమ్ = పైకి వస్తున్న కిరణాలు గలవాడూ, శర+ఉపమైః = బాణాలతో సమానమైన, అంశుభిః = కిరణాలతో, తమ్ = ఆ అసురుని, ఘ్నన్తమ్ ఇవ = హింసిస్తున్నట్లున్న వాడూ అయిన, బాల–సూర్యమ్ = బాల సూర్యుని, ప్రీతః = ఆనందించిన, అహమ్ = నేను, దదర్శ = చూశాను.

**తా :** అప్పుడు చీకట్లను తొలగిస్తూ, గగనసీమలో రక్తవర్ణంతో ప్రకాశిస్తున్న బాలసూర్యుడు కనిపించాడు. బాణాలవంటి తన కిరణాలతో అసురుని హింసిస్తున్నట్లున్న ఆ సూర్యకిరణాలు పైకి చిమ్ముతుండగా నేను ప్రీతితో చూశాను.





శ్లో॥ సమాకులం భావిభిరాస్యవర్యై
ర్బ్రహ్మాణమద్రాక్షమథాభ్రరూపమ్ ।
సహస్రనేత్రాణి దదర్శ తస్మిన్
ప్రతీక్షమాణాన్యభయం జనన్యాః ॥ 49

**ప్ర :** అథ = ఆ తర్వాత, భావిభిః = కాబోయెడి, ఆస్య-వర్యైః = మేటిమొగాలతో, సమాకులమ్ = నిండిన, అభ్ర-రూపమ్ = మేఘరూపంలో వున్న, బ్రహ్మాణమ్ = సృష్టికర్తను, అద్రాక్షమ్ = దర్శించాను. తస్మిన్ = ఆ మేఘరూపబ్రహ్మలో, జనన్యాః = తల్లియొక్క, అభయమ్ = అభయాన్ని గూర్చి (నిర్భయత్వానికి హామీ ఇవ్వటాన్ని), ప్రతీక్షమాణాని = ఎదురుచూస్తున్న, సహస్ర-నేత్రాణి = వేలకన్నులను, దదర్శ = చూశాను.

**తా :** ఆపై మేఘరూపంలో వున్న బ్రహ్మను దర్శించాను. దానిలో ఎన్నో ముఖాలనూ, మాత అభయానికై ఎదురుచూస్తున్న వేల కన్నులను దర్శించాను.





శ్లో॥ ద్వికోటిభాస్వద్వరసూర్యభాసం
జ్యోతిస్తదా సౌమ్యమరాతినాశి ।
నారీశరీరం రమణీయకాన్తి
దూరాదుదీచ్యాముదియాయ శుభ్రమ్ ॥ 50

ప్ర : తదా = అప్పుడు, ద్వి–కోటి–భాస్వద్–వర–సూర్య–భాసమ్ : ద్వి–కోటి = రెండుకోట్ల సంఖ్యగల, భాస్వద్ = ప్రకాశిస్తున్న, వర = శ్రేష్ఠమైన, సూర్య = సూర్యులయొక్క, భాసమ్ = కాంతిగలదీ, సౌమ్యమ్ = శాంతమైనదీ, అరాతి–నాశి = శత్రువులను నశింపజేయగలదీ, రమణీయ–కాంతి = సుందరకాంతిగలదీ, శుభ్రమ్ = స్వచ్ఛమైనదీ, నారీ–శరీరమ్ = స్త్రీరూపం గలదీ అయిన, జ్యోతిః =వెలుగు, దూరాత్ = దూరంగా, ఉదీచ్యామ్ = ఉత్తరదిక్కున, ఉదియాయ = ఉదయించింది.

**తా :** అప్పుడు దూరంగా ఉత్తరదిక్కున ఉదయించింది. అది రెండుకోట్ల సూర్యుల శ్రేష్ఠకాంతితో ప్రకాశిస్తోంది. సౌమ్యం, కానీ శత్రువినాశక మది. నిర్మలమూ, రమణీయమూ అయిన నారీ స్వరూపంతో అది కనిపించింది.





**శ్లో॥ తాం హ్లాదితా దీప్తజగత్సు దేవా-**
**స్తామన్తరిక్షే మధురం వయాంసి ।**
**జగుర్మనుష్యాః ప్రణిపత్య చోర్వ్యాం**
**విశ్వం వినష్టాధి యదా వివేశ ॥ 51**

**ప్ర :** వినష్ట+ఆధి = నశించిన మనోవ్యథలు గల, విశ్వమ్ = ప్రపంచాన్ని, యదా = ఎప్పుడు, వివేశ = (ఆమె) ప్రవేశించిందో (అప్పుడు), తామ్ = ఆమెను, హ్లాదితాః = ఆనందింపజేయబడిన, దేవాః = దేవతలు, దీప్త-జగత్సు = వెలిగే లోకాలలో (స్వర్గాది లోకాలలో), వయాంసి = పక్షులు, మధురమ్ = తీయగా, అంతరిక్షే = గగనమందూ, మనుష్యాః = మనుష్యులు, ఉర్వ్యామ్ = భూమిపై, ప్రణిపత్య = సాష్టాంగపడి, తామ్ = ఆమెను గూర్చి, జగుః = గానం చేశారు.

**తా :** ఆ దేవత మనోవ్యథలులేని విశ్వంలో ప్రవేశించగానే పై లోకాలలో దేవతలు, అంతరిక్షంలో పక్షులూ, భూలోకంలో మనుష్యులూ ఆమె పాదాలకు మ్రొక్కి మధురంగా ఆమెను గూర్చి గానం చేశారు.





**శ్లో॥ సమాధిధీరా హిమభూతదేహా**
**యుగాన్యనేకాని హిమాద్రికూటే ।**
**యే యోగినో భారతగోప్తృరూపా-**
**స్తే తుష్టువుస్తాం ముదితా మహాన్తః ॥ 52**

**ప్ర :** సమాధి-ధీరాః = సమాధిలో స్థిరంగా నిలచిన వారు, హిమ-భూత-దేహాః = మంచుగా మారిన శరీరాలు గలవారు, భారత-గోప్తృ-రూపాః = భారతదేశానికి రక్షకుల రూపంలో వున్నవారు (అయి), యే = ఏ, యోగినః = యోగులు, అనేకాని = ఎన్నో, యుగాని = యుగాలనుండి, హిమ+అద్రి-కూటే = హిమవత్పర్వతమనే ఇంటిలో (హిమగిరి శిఖరంపై), (భవన్తి = ఉన్నారో), తే = ఆ, మహాన్తః = మహాత్ములు, ముదితాః = ఆనందించినవారై, తామ్ = ఆమెను, తుష్టువుః = స్తుతించారు.

**తా :** హిమాలయపర్వతశిఖరాలే గృహాలుగా యుగయుగాలుగా యోగులు నివసిస్తున్నారు. వారు నిశ్చలసమాధిలో నిలువ గలవారు. శరీరమే మంచుగా మారిన మహనీయులు. భారతదేశరక్షకులు. వారు ఆనందంగా ఆ దేవతను స్తుతించారు.





శ్లో॥ జ్ఞానాకరేభ్యో హి విలోచనేభ్యో
హిమాని మన్దం యుగసఞ్చితాని ।
ఉత్సార్య దేవీమథ భీమకాన్తిం
మహాప్రతాపా బలినీమగాయన్ ॥ 53

ప్ర : మహా–ప్రతాపాః = గొప్ప పరాక్రమం గల ఆ యోగులు, జ్ఞాన+ఆకరేభ్యః = జ్ఞానానికి నిలయాలైన, విలోచనేభ్యః = కన్నుల నుండి, యుగ–సంచితాని = యుగాల నుండి పేరుకొని వున్న, హిమాని = మంచు(ల)ను, మన్దమ్ = మెల్లగా, ఉత్సార్య = తొలగించుకొని, అథ = ఆ తరువాత, భీమ–కాన్తిమ్ = భీకరమైన వెలుగు గలిగి, బలినీమ్ = బలవంతురాలైన, దేవీమ్ = ఆ దేవతను గూర్చి, అగాయన్ = పాడారు/నుతించారు.

**తా :** ఆ యోగులు హిమాద్రికూటంపై సమాధిస్థితిలో వున్నందువల్ల జ్ఞానానికి నిలయాలైన వారి కన్నులపై (కనురెప్పలపై) అనాదిగా మంచు పేరుకొని వుంది. దానిని మెల్లగా తొలగించుకొని మహాప్రతాపం గల ఆ యోగులు బలవతియైన, భీమకాంతిగల ఆ దేవిని గూర్చి గానం చేశారు.





**శ్లో॥ తుభ్యం నమో దేవి! విశాలశక్త్యై**
**నమామి భీమాం బలినీం కృపాలుమ్ ।**
**త్వమేవ వై తారయసీహ జాతీ-**
**రూర్జస్వలాయై నమ ఆదిదేవ్యై ॥ 54**

ప్ర : దేవి! = దేవీ!, విశాల–శక్త్యై = గొప్ప సత్తువగల, తుభ్యమ్ = నీకు, నమః = నమస్కారం. భీమామ్ = భయంకరమైన దానవు, బలినీమ్ = బలశాలినివి, కృపాలుమ్ = దయామయివి అయిన నీకు, నమామి = నమస్కరిస్తున్నాను. త్వమ్ – ఏవ = నీవే, ఇహ = ఈ లోకంలో, జాతీః = జాతులను, తారయసి వై = తరింపజేస్తున్నావు గదా!, ఊర్జస్వలాయై = మిక్కిలి బలంగల, ఆది–దేవ్యై = ఆదిదేవికి, నమః = నమస్కారం.

**తా :** మహాశక్తిగల దేవీ! నీకు నమస్సు. భీకరయై, బలవతియై దయామయివైన నీకు నమస్కరిస్తున్నాను. నీవే ఈ జాతులను తరింపజేయగలదానవు. బలసంపన్న అయిన ఆది దేవికి నీకు నమస్కృతి.





శ్లో॥ కస్తే బలం వర్ణయితుం సమర్థో
దేవి! ప్రచణ్డే కరపల్లవేన ।
ఏకేన హి భ్రామయసే రుణత్సి
విశ్వం సతారార్కమనన్తవీర్యే! ॥ 55

ప్ర : ప్రచండే! = ప్రతాపశాలినివైన, దేవి! = దేవీ!, తే = నీయొక్క, బలమ్ = శక్తిని, వర్ణయితుమ్ = వర్ణించటానికి, సమర్థః = సమర్థతగలవాడు, కః = ఎవడు? హి = అది యుక్తమే. అనన్త–వీర్యే = అంతులేని శక్తిగలదానా! ఏకేన = ఒకే, కర–పల్లవేన = చిగురువంటి చేతితో, స–తారా+అర్కమ్ = తారలూ, సూర్యులతో సహా, విశ్వమ్ = ప్రపంచాన్ని, భ్రామయసే = త్రిప్పగలవు, రుణత్సి = ఆపగలవు.

**తా :** ప్రచండురాలా! దేవీ! నీ శక్తిని వర్ణించటానికి ఎవరికి శక్తి ఉన్నది? అనంత బలసంపన్నా! చిగురుటాకు వంటి నీ చేతితో ఈ విశ్వాన్ని సూర్యుడు, తారలతో సహా నీవు త్రిప్పగలవూ, ఆపగలవు కూడా.





**శ్లో॥ ఆజౌ యదా నృత్యసి చణ్డి! ఘోరే!**
**సృగాలఘుష్టే! దధతీ త్రిశూలమ్ ।**
**స్పర్శేన కమ్పన్త ఇవాయుధస్య**
**మహాన్తి తారానియుతాని నాకే ॥ 56**

**ప్ర :** చండి = తీవ్రతగలదానా!, ఘోరే = భయంకరమైనదానా!, సృగాల-ఘుష్టే : సృగాల = నక్కల (అరుపుల)తో, ఘుష్టే = ఘోషింపబడినదానా!, త్రిశూలమ్ = త్రిశూలాన్ని, దధతీ = ధరించినదానవై, యదా = ఎప్పుడు, ఆజౌ = యుద్ధమందు, నృత్యసి = నృత్యం చేస్తావో (అప్పుడు), ఆయుధస్య = ఆయుధం యొక్క, స్పర్శేన = తాకిడితో, నాకే = స్వర్గంలో, మహాన్తి = గొప్పవైన, తారా-నియుతాని = లక్షల తారలు, కంపన్త ఇవ = వణుకుతున్నట్లున్నాయి.

**తా :** భయంకరమైనదానా! చండీ! నీవు త్రిశూలాన్ని ధరించి నక్కలఘోషలతో యుద్ధరంగంలో నృత్యం చేస్తుంటే ఆ ఆయుధం యొక్క తాకిడితో నాకలోకంలోని లక్షల తారలు కంపిస్తున్నట్లుంది.





శ్లో॥ దయార్ద్రచిత్తా రుదితేన పుంసాం
హంసి ప్రజాపీడకమస్తకేషు ।
యో మృత్యురత్తా భువనస్య రౌద్రః
స కిఙ్కరస్తే వసతి త్రిశూలే ॥ 57

**ప్ర :** పుంసామ్ = పురుషుల (జనుల) యొక్క, రుదితేన = ఆక్రందనలతో, దయా+ఆర్ద్ర = తడిసిన, చిత్తా = మనస్సుగలదై, ప్రజా... మస్తకేషు : ప్రజా = జనులకు, పీడక = కీడు చేయువారియొక్క, మస్తకేషు = తలలపై, హంసి = పీడిస్తున్నావు. యః మృత్యుః = ఏ మృత్యుదేవత, రౌద్రః = భీకరుడై, భువనస్య = లోకానికి, అత్తా = భక్షకుడో, సః = ఆ మృత్యువు, తే = నీ యొక్క, త్రిశూలే = త్రిశూలమందు, కింకరః (సన్) = సేవకుడై, వసతి = నివసిస్తున్నాడు.

**తా :** జనుల ఆక్రందనలతో నీ మనస్సు దయతో కరిగింది. ఆ కరుణతోనే నీవు ప్రజాపీడకుల తలలపై మొత్తి పీడిస్తున్నావు. భీకరుడై భువనాలను భక్షించే మృత్యువు ఇప్పుడు నీ త్రిశూలంలో కింకరుడై వసిస్తున్నాడు.





శ్లో॥ శక్తిః పరా కోటిషు మానవానాం
సంమన్యునా త్వం భవసి ప్రబుద్ధా ।
ఆర్యాన్ విపన్నానవతీర్య పాసి
యుగే యుగే యుధ్యస ఆర్యమాతః! ॥ 58

**ప్ర :** పరా శక్తిః = పరా శక్తివైన, త్వమ్ = నీవు, మానవానామ్ = మానవులయొక్క, కోటిషు = సమూహాలయందు, సంమన్యునా = తీవ్రక్రోధరూపంతో, ప్రబుద్ధా = మేల్కొని, భవసి = ఉన్నావు. అవతీర్య = అవతరించి, విపన్నాన్ = కష్టాలలో ఉన్న, ఆర్యాన్ = ఆర్యులను, పాసి = కాపాడుతున్నావు. ఆర్య–మాతః = ఆర్యుల తల్లీ!, యుగే యుగే = ప్రతియుగంలోనూ, యుధ్యసే = పోరాడుతున్నావు.

**తా :** నీవు పరాశక్తివి. మానవకోటిలో తీవ్ర క్రోధరూపంలో మేల్కొని వున్నావు. నీవు అవతరించి కష్టాలలో వున్న ఆర్యులను కాపాడుతున్నావు. ఆర్యులకు తల్లివై యుగయుగంలోనూ పోరాడుతున్నావు.





శ్లో॥ సద్యోఽపి పశ్యామి గిరావుదీచ్యాం
దేదీప్యమానం ధవలం వపుస్తే ।
త్వం భ్రాజసే జ్యోతిరుదేషి సౌమ్యే!
ప్రకాశయన్తీ భువనాని కాన్త్యా ॥ 59

**ప్ర :** సద్యః+అపి = ఇప్పుడు కూడా, ఉదీచ్యామ్ = ఉత్తరాన, గిరౌ = పర్వతంపై, దేదీప్యమానమ్ = వెలుగుతున్న, ధవలమ్ = తెల్లనైన, తే = నీ యొక్క, వపుః = శరీరాన్ని, పశ్యామి = చూస్తున్నాను. త్వమ్ = నీవు, జ్యోతిః = వెలుగువై, భ్రాజసే = ప్రకాశిస్తున్నావు. సౌమ్యే! = ప్రసన్నురాలా!, కాన్త్యా = వెలుగుతో, భువనాని = లోకాలను, ప్రకాశయన్తీ = వెలుగొందజేస్తూ, ఉదేషి = ఉద్భవిస్తున్నావు.

**తా :** దేవీ! ఇప్పుడు కూడా ఉత్తరదిక్కున పర్వతంపై తెల్లగా వెలిగిపోతున్న నీ శరీరాన్ని చూస్తున్నాను. నీవు జ్యోతివై వెలుగుతున్నావు. సౌమ్యురాలా! నీవు కాంతితో భువనాలను వెలుగొందజేస్తూ ఉద్భవిస్తున్నావు.





శ్లో॥ ధేనౌ సమారూఢమనోజ్ఞకాన్తీ-
రణోన్మదాయాం చరసీయమార్యా ।
శైలా ఇవోత్తుఙ్గశిఖాః సమూలాః
పతన్తి సఙ్ఘాః పరితోఽసురాణామ్ ॥ 60

ప్ర : ఇయమ్ ఆర్యా = పూజ్యురాలవైన ఈ నీవు, రణ+ఉన్మదాయామ్ = యుద్ధోన్మాదం గల, ధేనౌ = గోవుపై, సమారూఢ–మనోజ్ఞ–కాంతిః : సమారూఢ = అధివసించిన దానవై, మనోజ్ఞ = అందమైన, కాంతిః = వెలుగుగలదానవై, చరసి = సంచరిస్తున్నావు. అసురాణామ్ = రక్కసుల యొక్క, సంఘాః = సమూహాలు, ఉత్తుంగ–శిఖాః = ఉన్నత శిఖరాలుగల, శైలాః = కొండలవలె, సమూలాః = అడుగుభాగంతో పాటు (పెకలింపబడినట్లు), పరితః = చుట్టూ, పతన్తి = పడుతున్నాయి.

**తా :** ఆర్యా! రణోన్మాదంగల ధేనువుపై అధివసించి గొప్ప వెలుగుతో నీవు సంచరిస్తున్నావు. నీచుట్టూ రాక్షసుల గుంపులు సమూలంగా పెకలింపబడిన ఉన్నతశిఖరాలు గల కొండలవలె పడుతున్నాయి.





శ్లో॥ సా శుభ్రవర్ణాఽసితవృత్తశృఙ్గా
హిమస్య రాశిశ్చలతీవ తూర్ణమ్ ।
దేవప్రియా భారతభూమిరార్యా
ధేనుస్వరూపేణ విహన్తి శత్రూన్ ॥ 61

ప్ర : శుభ్ర–వర్ణా = తెల్లని వన్నె గలదీ, అసిత–వృత్త–శృంగా : అసిత = నల్లనివీ, వృత్త = గుండ్రనివీ అయిన, శృంగా = కొమ్ములు గల, సా = ఆ గోవు, హిమస్య = మంచుయొక్క, రాశిః ఇవ = ముద్ద (మొత్తం) లాగా, తూర్ణమ్ = వేగంగా, చలతి = కదులుతోంది. దేవ–ప్రియా = దేవతల కిష్టమైన, ఆర్యా = పూజనీయమైన, భారతభూమిః = భారతభూమి, ధేను–స్వరూపేణ = గోరూపంతో, శత్రూన్ = శత్రువులను, విహన్తి = చంపుతోంది.

**తా :** తెల్లని రంగు, నల్లని గుండ్రటికొమ్ములు గల ఆ గోవు మంచుకొండలా (ముద్దలా) వేగంగా కదులుతోంది. దేవతలు మెచ్చిన పుణ్యభూమి భారతఖండం. అది గోస్వరూపంతో శత్రుసంహారం చేస్తోంది.





శ్లో॥ వ్యూహాస్త్వకస్మాజ్జితదైవతానాం
భయేన తే పాణ్డురకాన్తివక్త్రాః ।
వారిప్రపాతా ఇవ పర్వతేభ్యో
ధావన్త్యధో వేగపరాః సశబ్దాః ॥ 62

ప్ర : భయేన = భయంతో, పాండుర–వక్త్ర–కాన్త్యః : పాండుర = పాలిపోయిన, కాన్తి = కాంతిగల, వక్త్రాః = ముఖముగల, తే = ఆ, జిత–దైవతానామ్ = రాక్షసులయొక్క, వ్యూహాః = సమూహాలు, అకస్మాత్ = హఠాత్తుగా, వేగ–పరాః = త్వరగలవీ, సశబ్దాః = రొదచేస్తున్నవీ, వారిప్రపాతాః ఇవ = సెలయేళ్ళవలె, పర్వతేభ్యః = కొండలనుండి, అధః = క్రిందకు, ధావన్తి = పరుగుపెడుతున్నాయి.

**తా :** ఆ రక్కసులు మొగాలు భయంతో పాలిపోయాయి. రాక్షససమూహాలు కొండపై నుండి క్రిందకు పడుతున్నాయి. ఆ పతనం చప్పుడు చేస్తూ వేగంగా కొండల మీదనుండి క్రిందకు దూకే సెలయేళ్ళ పతనంలా ఉంది.





శ్లో॥ శృణోమి తే పాఞ్చనదేషు భీమే!
స్వరానుదారాన్ జయనాదముగ్రమ్ ।
నిహన్యమానస్య రవం బలస్య
భయఙ్కరే! తారతరం శృణోమి ॥ 63

ప్ర : భీమే = భయంకరమైనదానా!, పాంచనదేషు = పంచనదులు ప్రవహించే (పంజాబ్) ప్రాంతంలో, తే = నీ యొక్క, ఉదారాన్ = దయతో గూడిన, స్వరాన్ = మాటలను, ఉగ్రమ్ = తీక్ష్ణమైన, జయ–నాదమ్ = విజయనినాదాన్నీ, శృణోమి = వింటున్నాను. భయంకరే! = చండి!, నిహన్యమానస్య = చంపబడుతున్న, బలస్య = (శత్రు) సేనయొక్క, తారతరమ్ = బిగ్గరగా వినిపిస్తున్న, రవమ్ = చప్పుడును, శృణోమి = వింటున్నాను.

**తా :** చండి! పంజాబ్ ప్రాంతంలో నీ ఉదారస్వరాన్నీ! నీ ఉగ్రవిజయనినాదాన్నీ నేను వింటున్నాను. నీచే చంపబడుతున్న శత్రువుల ఆక్రందనధ్వనులను కూడా వింటున్నాను.





**శ్లో॥ కృష్ణస్య సైషా యమునా స్రవన్తీ**
**రక్తేన నీలం విససర్జ వర్ణమ్ ।**
**వజ్గేష్వసృక్కర్దమమేవ పశ్య**
**దిగ్దక్షిణా భాతి సులోహితేవ ॥ 64**

**ప్ర :** సా ఏషా = ఈ, యమునా స్రవన్తీ = యమునానది, రక్తేన = నెత్తుటితో, కృష్ణస్య = కృష్ణునియొక్క, నీలం వర్ణమ్ = నల్లరంగును, విససర్జ = వదలిపెట్టింది. వంగేషు = బెంగాలులో, అసృక్–కర్దమమ్ ఏవ = నెత్తుటి బురదనే, పశ్య = చూడు. దక్షిణాదిక్ = దక్షిణదిక్కు, సులోహితా+ఇవ = బాగా ఎఱ్ఱబడినట్లు, భాతి = ప్రకాశిస్తోంది.

**తా :** కృష్ణస్పర్శతో నల్లనైన యమునానది నెత్తుటితో ఎఱ్ఱనై నల్లదనాన్ని వదిలింది. పంజాబ్ ప్రాంతంలో నెత్తుటి బురదను గమనించు. దక్షిణదిక్కు ఎఱ్ఱబడినట్లు ప్రకాశిస్తోంది.





**శ్లో॥ స్పృష్టాస్త్రిశూలేన విహాయ సీమాః**
**సులోహితా భాన్తి దిశః సమన్తాత్ ।**
**అభ్రాణి తే రక్తమయాని భీమే!**
**విభాన్తి యుద్ధేన సుదారుణేన ॥ 65**

**ప్ర :** త్రిశూలేన = (నీ) త్రిశూలంచే, స్పృష్టాః = తాకబడిన, దిశః = దిక్కులు, సీమాః = హద్దులను, విహాయ = వీడి, సులోహితాః (సత్యః) = ఎఱ్ఱనివై, సమన్తాత్ = అంతటా, భాన్తి = ప్రకాశిస్తున్నాయి. భీమే = భయంకరమైనదానా!, సుదారుణేన = పరమదారుణమైన, తే = నీ యొక్క, యుద్ధేన = పోరుతో, అభ్రాణి = మేఘాలు/ఆకాశాలు, రక్తమయాని (సన్తి) = నెత్తుట నిండి, విభాన్తి = ప్రకాశిస్తున్నాయి.

**తా :** చండి! నీ త్రిశూలం తాకిడితో దిక్కులన్నీ ఎఱ్ఱబడి హద్దులు చెరుపుకొని అంతటా ప్రకాశిస్తున్నాయి. నీ దారుణయుద్ధంతో మేఘాలు (మిన్నులు) రక్తమయాలై వెలుగుతున్నాయి.





శ్లో॥ సిన్ధోస్తటేషూపలకర్కశేషు
దేవీమపశ్యం యుధి శేషితారీన్ ।
నిశ్శేషయన్తీమదయాం సకోపాం
శివాం త్రిశూలేన శివస్య శత్రూన్ ॥ 66

ప్ర : ఉపల–కర్కశేషు : ఉపల = రాళ్ళచే, కర్కశేషు = కఠినంగా ఉన్న, సింధోః = సముద్రంయొక్క, తటేషు = తీరాలలో, యుధి = యుద్ధంలో, శేషిత+అరీన్ = మిగల్చబడిన శత్రువులను, శివస్య = శివునియొక్క, శత్రూన్ = శత్రువులను, త్రిశూలేన = త్రిశూలంతో, నిశ్శేషయన్తీమ్ = మిగలకుండా చేస్తున్న, అదయామ్ = కరుణలేనిదై, సకోపామ్ = రోషంగలదై, శివామ్ = మంగళకర అయిన, దేవీమ్ = ఆ దేవిని, అపశ్యమ్ = చూశాను.

**తా :** రాళ్ళతో కర్కశంగా ఉన్న సాగరతీరాలలో నేను దేవిని చూశాను. ఆమె జాలిమాని, కోపంతో త్రిశూలంతో శివ శత్రువులను సంహరిస్తూ శివస్వరూపయై కనిపించింది.





శ్లో॥ ఖురైః సునిష్పిష్టమిదం సురభ్యా
ఘోరం కిమేవాపి సుకృష్ణవర్ణమ్ ।
మాంసస్య పిణ్డం హ్యవనౌ నిరీక్షే
శేషోఽయమస్త్యేవ తవాహితానామ్ ॥ 67

**ప్ర :** సురభ్యా = గోవు యొక్క, ఖురైః = గిట్టలచేత, సునిష్పష్టమ్ = త్రొక్కి ముద్ద చేయబడినదీ, సుకృష్ణ–వర్ణమ్ = మరీ నల్లనిదీ, ఘోరమ్ = భీకరమైనదీ అయిన, ఇదమ్ = ఇది, కిమ్–ఏవ–అపి = ఏమిటో?, అవనౌ = నేలపై, మాంసస్య = మాంసం యొక్క, పిండమ్ = ముద్దను, నిరీక్షే = చూస్తున్నాను. అయమ్ = ఇది, తవ = నీ యొక్క, అహితానామ్ = శత్రువులయొక్క, శేషః ఏవ = మిగులు భాగంగానే, అస్తి = ఉన్నది.

**తా :** ఆ ధేనువుయొక్క గిట్టలచే త్రొక్కబడి ముద్దచేయబడి మరీ నల్లగా ఘోరంగా ఏదో కనిపిస్తోంది. అది ఏమిటో? నేలపై మాంసపు ముద్దలా కనిపిస్తోంది. నీ శత్రువులు ఇలా మిగిలిపోయారేమో?





శ్లో॥ భగ్నాని తస్మిన్నిచయే విరూపే
ప్రనిస్సరన్తీవ శిరాంసి కాని ।
పాదాః కరాశ్చాపి హి తత్ర తత్ర
క్రూరాసి రుద్రాణి! కరాలకృత్యా ॥ 68

ప్ర : విరూపే = రూపాన్ని కోల్పోయిన, తస్మిన్ నిచయే = ఆ గుట్టలో, భగ్నాని = తెగిపడిన, కాని శిరాంసి = ఏవో తలలు, ప్రనిస్సరన్తి ఇవ = కదులుతున్నట్లున్నాయి. (బయట పడుతున్నట్లున్నాయి). తత్ర తత్ర = అక్కడక్కడ, పాదాః = కాళ్ళు, కరాః చ అపి = చేతులు కూడా (కదులుతున్నట్లున్నాయి). రుద్రాణి! = రుద్రాణి!, (త్వమ్ = నీవు), క్రూరా = క్రూరురాలవూ, కరాల–కృత్యా = క్రూరకర్మలు చేసే దానవుగా, అసి = ఉన్నావు.

**తా :** విరూపంగా ఉన్న ఆ (శరీరాల) గుట్టనుండి ఏవో తలలు కదులుతున్నట్లున్నాయి. అక్కడక్కడ కాళ్ళు, చేతులు కూడా కదులుతున్నట్లున్నాయి. రుద్రాణి! నీవు క్రూరురాలవు. క్రూరకర్మలు చేస్తున్నావు.





శ్లో॥ క్రూరాసి రుద్రాణ్యథవా జఘన్యే
క్రూరే ప్రజాపీడనరూఢగర్వే ।
దయేవ భూతేయమలం యదార్యం
స్వర్గప్రదం మృత్యుమవాప యుద్ధే ॥ 69

**ప్ర :** రుద్రాణి! = రుద్రాణి!, క్రూరా+అసి = క్రూరురాలవే. అథవా = అలాకాదు, జఘన్యే = నీచుడను, ప్రజా... గర్వే : ప్రజా = ప్రజలను, పీడన = పీడించుట ద్వారా, రూఢ = ధ్రువీకరింపబడిన, గర్వే = గర్వం గలవాడై, క్రూరే = క్రూరుడూ అయిన శత్రువుపై, ఇయమ్ = ఇది, దయా ఇవ = దయగానే, భూతా = నిలిచింది, యద్ = ఏదంటే, యుద్ధే = యుద్ధంలో (శత్రువు), స్వర్గ–ప్రదమ్ = స్వర్గాన్ని ఇవ్వగలదీ, ఆర్యమ్ = మన్నింపదగినదీ అయిన, మృత్యుమ్ = మృత్యువును, అవాప = పొందాడు. అలమ్ = చాలు.

**తా :** రుద్రాణి! నీవు క్రూరురాలవు. (శత్రువులను క్రూరంగా సంహరిస్తున్నావు). అయినా పరులను పీడించి గర్విష్ఠుడై, నీచుడై, క్రూరుడైన శత్రువుపై ఈ క్రౌర్యం దయయే అవుతుంది. ఎందుకంటే ఆ శత్రువు యుద్ధంలో పూజ్యమై, స్వర్గప్రదమైన మృత్యువును పొందాడు.





శ్లో॥ ఏకో గతాసోరపి రుద్రశత్రో-
ర్ధత్తే కరః పావకగర్భమస్త్రమ్ ।
ప్లుష్టశ్చ చీర్ణశ్చ తథాపి దగ్ధా-
నసూన్ భవాన్యాం క్షిపతీవ దైత్యః ॥ 70

ప్ర : గతాసోః+అపి = మరణించిన వాడైనా, రుద్ర-శత్రోః = రుద్రుని శత్రువుయొక్క, ఏకః = ఒకే ఒక (అద్వితీయమైన), కరః = చేయి, పావక-గర్భమ్ = లోన అగ్ని గల, అస్త్రమ్ = మంత్రసిద్ధమైన బాణాన్ని, ధత్తే = ధరిస్తాడు. దైత్యః = రక్కసి, చీర్ణః చ = ముక్కలు చేయబడినాడు, ప్లుష్టః చ = దహింపబడినాడు, తథాపి = అయిననూ, దగ్ధాన్ = తగులబడిన, అసూన్ = ప్రాణాలను, భవాన్యామ్ = భవానిపై, క్షిపతి ఇవ = విసురుతున్నట్లున్నాడు.

**తా :** రుద్రశత్రువు మరణించినా ఆయన చేయి అగ్నిగర్భమైన ఆయుధాన్ని ధరించగలదు. చీలికలై దగ్ధుడైన శత్రువు తన దగ్ధప్రాణాలను భవానిపైకి విసురు తున్నట్లుంది.





శ్లో॥ స్రోతాంసి పశ్యామి మహాయుధాస్యా-
దుద్గీర్యమాణాని హుతాశనస్య ।
ధృష్టోప్యసౌ నాలభతే తు చణ్డీం
తిష్ఠన్ ప్రభామణ్డలమూర్తిమగ్రే ॥ 71

ప్ర : మహా+ఆయుధ+ఆస్యాత్ = ఆ మేటి ఆయుధం యొక్క అగ్రభాగం నుండి, ఉద్గీర్యమాణాని = వెడలగ్రక్కబడుతున్న, హుతాశనస్య = అగ్నియొక్క, స్రోతాంసి = ప్రవాహాలను, పశ్యామి = చూస్తున్నాను. అసౌ = ఆ ఆయుధం, ధృష్టః అపి = దయారహితమైనను, అగ్రే = ఎదురుగా, తిష్ఠన్ (అపి) = నిలిచి కూడా, ప్రభా-మండల-మూర్తిమ్ = కాంతివలయాకృతి గల, చండీమ్ = చండిని, న ఆలభతే = తాకలేక పోయింది.

**తాత్పర్యం :** ఆ మేటి ఆయుధం (మహాయుధుడైన ఆ రుద్రశత్రువు) అగ్ని ప్రవాహాలను వెడలు గ్రక్కుతోంది (వెడల గ్రక్కుతున్నాడు). నిర్దయమైనా (నిర్దయుడైనా) కంటికి ఎదుటనే నిలిచి వున్నా కాంతివలయాకృతి గల ఆ చండిని అది (తాను) కనీసం తాకలేక పోయింది (పోయాడు).





శ్లో॥ ప్రక్షిప్తఖడ్గస్తు విషాణమధ్యే
విష్టమ్భయత్యన్తిమచేష్టితన్తత్ ।
సమాప్తమేతత్తవ తర్కయామి
మహావ్రతం దేవి! విశాలవీర్యే! ॥ 72

**ప్ర :** విషాణ–మధ్యే = కొమ్ముల మధ్య, ప్రక్షిప్త = విసరబడిన (నిలుపబడిన), ఖడ్గః తు = కత్తి, తత్ = ఆ, అన్తిమ–చేష్టితమ్ = చివరి కదలికను, విష్టంభయతి = నిరోధిస్తోంది. విశాల–వీర్యే! = అనంతశక్తిగలదానా!, దేవి! = దేవి!, ఏతత్ = ఈ, తవ = నీ యొక్క, మహావ్రతమ్ = మహా (గొప్ప) వ్రతం, సమాప్తమ్ = ముగిసింది (అని), తర్కయామి = భావిస్తున్నాను.

**తా :** ఆ రక్కసుని కొమ్ముల మధ్య విసరబడిన కత్తి అతని చివరి చేష్టితాన్ని నిరోధించి స్తబ్ధుని చేసింది. మహాశక్తిసంపన్నా! దేవి! ఇంతటితో నీ మహావ్రతం ముగిసిందని భావిస్తున్నాను.





శ్లో॥ తుభ్యం నమో దేవి! విశాలశక్త్యై
భీమవ్రతే! తారిణి! కష్టసాధ్యే! ।
త్వం భారతీ రాజసి భారతానాం
త్వమీశ్వరీ భాసి చరాచరస్య ॥ 73

**ప్ర :** దేవి! = దేవి!, భీమ–వ్రతే! = భీకరవ్రతాలు గలదానా!, తారిణి! = తరింపజేయు దానా!, కష్ట–సాధ్యే = సులువుగా లభింపనిదానా!, విశాలశక్త్యై = అనంతశక్తిగల, తుభ్యమ్ = నీకు, నమః = కేల్మోడ్పు. త్వమ్ = నీవు, భారతానామ్ = భారతీయుల యొక్క, భారతీ (ఇవ) = భారతివై, రాజసి = ప్రకాశిస్తున్నావు. త్వమ్ = నీవు, చరాచరస్య = స్థావరజంగమాత్మకమైన విశ్వానికి, ఈశ్వరీ (ఏవ) = పాలికవై, భాసి = వెలుగొందుతున్నావు.

**తా :** భీమవ్రతా! తారిణి! కష్టసాధ్యా! విశాలశక్తిమహితా! నీకు నమస్కారం. నీవు భారతీయుల భారతివి. నీవు చరాచరజగత్తునకు పాలికవు. ఉభయధా నీవు విరాజిల్లుతున్నావు.





**శ్లో॥ త్వమీశ్వరీ త్వం జననీ ప్రజానాం**
**కోఽన్యః ప్రభుర్దానమిదం తవాద్యే! ।**
**స్వామిత్వమైశ్వర్యమనిన్ద్యతేజో**
**దదాసి యా సాపి నిహంసి రుష్టా ॥ 74**

**ప్ర :** త్వమ్ = నీవు, ఈశ్వరీ = పాలికవు, త్వమ్ = నీవు, ప్రజానామ్ = జనులకు, జననీ = తల్లివి. ఆద్యే = శక్తిసంపన్నా!, తవ = నీయొక్క, ఇదమ్ = ఈ, దానమ్ = దానానికి, అన్యః కః = మరెవరు, ప్రభుః = సమర్థుడు?, స్వామిత్వమ్ = ప్రభుత్వాన్నీ, ఐశ్వర్యమ్ = ఈశ్వరత్వాన్నీ (సంపదనూ), అనింద్య–తేజః = మొక్కవోని తేజస్సును, యా = ఎటువంటినీవు, దదాసి = ఇవ్వగలవో, సా = అటువంటి నీవే, రుష్టా = కోపించినదానవై, నిహంసి = సంహరిస్తావు.

**తా :** సర్వశక్తిసంపన్నా! నీవు ఈశ్వరివి. నీవు ప్రజలకు తల్లివి. నీవలె దానమివ్వటానికి మరెవ్వరికీ సామర్థ్యం లేదు. నీవు అనుగ్రహిస్తే ఆధిపత్యాన్నీ, ఐశ్వర్యాన్నీ, మొక్కవోని తేజస్సునూ అందించగలవు. ఆ నీవే కోపిస్తే సంహరించగలవు.





శ్లో॥ నమో నమో వాహనమేతదార్యే!
హిమాభకాన్తం మధురాయతాక్షి! ।
తల్లాఙ్గులాగ్రేణ సుకృష్టభాసా
ధ్వజం కరోతీవ తవోచ్ఛ్రితేన ॥ 75

ప్ర : మధుర+ఆయత+అక్షి : మధుర = మనోహరమైన, ఆయత = విశాలమైన, అక్షి! =కన్నులు గలదానా!, ఆర్యే! = పూజ్యురాలా! దేవి!, నమః+నమః = మరల మరల నమస్సు, హిమ+ఆభ–కాన్తమ్ = మంచుకాంతివలె మనోహరమైన, ఏతత్ = ఈ, వాహనమ్ = వాహనం (సింహం), సుకృష్ట–భాసా = బాగా నల్లనివన్నె గలిగి, ఉచ్ఛ్రితేన = పొడవైన, తత్+లాంగుల+అగ్రేణ = తన తోక చివరతో, తవ = నీకు, ధ్వజమ్ = పతాకను, కరోతి ఇవ = చేసి (ఎత్తి) నట్లున్నది.

**తా :** మనోహరమైన విశాలమైన కన్నులు గలదానా! నీకు పునః పునః నమస్సులు. మంచువలె తెల్లనైన నీ వాహనం (సింహం) నల్లని కాంతిగల తన పొడవైన తోకతో నీకు పతాకను ఎత్తుతున్నట్లుంది.





**శ్లో॥ నమో నమో దేవి! తవాలకాలీ**
**రణశ్రమేణ ప్రసభం విముక్తా ।**
**ఉడ్డీయమానా నభసీవ మేఘో**
**వేణిచ్యుతా భాతి సుదీర్ఘవక్రా ॥ 76**

ప్ర : దేవి = దేవి!, నమః+నమః = మరల మరల నమస్సు. తవ = నీ యొక్క, అలక+అలిః = ముంగురుల వరుస, రణ–శ్రమేణ = యుద్ధంచేసి అలసిపోవుట చేత, ప్రసభమ్ = మిక్కిలిగా, విముక్తా = విడివడినదై, వేణి–చ్యుతా = జడనుండి జారినదై, సుదీర్ఘ–వక్రా = పొడవూ, వంపూ గలదై, నభసి = ఆకాశంలో, ఉడ్డీయమానా = ఎగురుతున్న, మేఘః ఇవ = మేఘంవలె, భాతి = ప్రకాశిస్తోంది.

**తా :** దేవీ! నమోనమః. నీవు యుద్ధంలో అలసిపోయావు. నీ జడనుండి అనివార్యంగా ముంగురులు విడివడ్డాయి. పొడవుగా ఉంగరాలు తిరిగివున్న ఆ ముంగురులు ఆకాశంపై ఎగురుతున్న మేఘంవలె ప్రకాశిస్తున్నాయి.





శ్లో॥ శ్వేతాననే! విద్యుదివాసి భూమౌ
రుషా ప్రదీప్తే హి విలోచనే తే ।
క్రీడన్త్యపాఙ్గేషు కరాలహాసా-
శ్శతహ్రదేవ స్తనయిత్నుమధ్యే ॥ 77

ప్ర : శ్వేత+ఆననే = తెల్లని మోము గలదానా!, భూమౌ = నేలపై, విద్యుద్-ఇవ = మెరుపువలె, అసి = ఉన్నావు. తే = నీ యొక్క, విలోచనే = కన్నులు, రుషా = కోపంతో, ప్రదీప్తే = మండుతున్నాయి. హి = నిజమే, అపాంగేషు = (నీ) కనుకొనలలో, కరాల-హాసాః = క్రూరమైన నవ్వులు, స్తనయిత్ను - మధ్యే = మేఘాలమధ్యలో, శతహ్రదా-ఇవ = మెఱుపులా, క్రీడన్తి = ఆడుతున్నాయి.

**తా :** శ్వేతవదనా! నీవు నేలపై మెరుపులా ఉన్నావు. నీ కళ్ళు కోపంతో మండుతున్నాయి. నీ కనుకొనలలోని క్రూరదరహాసాలు మేఘాల మధ్య మెరుపులా కదలాడుతున్నాయి.





శ్లో॥ ద్రష్టుం రిపూంస్తాన్పతితాన్ గతాసూన్
గ్రీవేయమీషన్నమితా చ శుక్లా ।
సజానువర్యం చరణం భవాన్యా-
స్తమ్భో హిమస్యేవ విభాతి శుభ్రమ్ ॥ 78

ప్ర : గత+అసూన్ = ప్రాణాలు పోయి, పతితాన్ = పడిపోయిన, తాన్ = ఆ, రిపూన్ = శత్రువులను, ద్రష్టుమ్ = చూచుటకై, శుక్లా = తెల్లనైన, ఇయమ్ = ఈ, గ్రీవా = మెడ, ఈషత్ = కొలదిగా, నమితా = వంచబడినది. స-జాను-వర్యమ్ = శ్రేష్ఠములైన మోకాళ్ళతో సహా, శుభ్రమ్ = తెల్లనైన, భవాన్యాః = భవానియొక్క, చరణమ్ = పాదం, హిమస్య = మంచుయొక్క, స్తమ్భః+ఇవ = స్తంభంవలె, విభాతి = ప్రకాశిస్తోంది.

**తా :** శత్రువులు ప్రాణాలు కోల్పోయి పడిపోయినారు. వారిని చూడాలని కొంచెంగా వంచిన నీ మెడ తెల్లగా శోభిస్తోంది. పాదాలనుండి మోకాళ్ళవరకు ఉన్న నీ తెల్లని కాలు మంచుకంబంలా ప్రకాశిస్తోంది.





శ్లో॥ శుక్లం ప్రవాతైరనిలోపమం తే
సంక్షోభితం భాసురతోయదాభమ్ ।
వాతీవ వాసో రుచిరాణి మధ్యే
భ్రాజన్త అఙ్గాని శశిప్రభేవ ॥ 79

ప్ర : తే = నీ యొక్క, అంగాని = శరీరావయవాలు, రుచిరాణి (సన్తి) = అందమైనవిగా, భ్రాజన్తే = ప్రకాశిస్తున్నాయి. మధ్యే = వాటిమధ్యన, ప్రవాతైః = గాలులచే, సంక్షోభితమ్ = రెపరెపలాడింపబడినదీ, శుక్లమ్ = తెల్లనిదీ, అనిల+ఉపమమ్ = గాలితో పోలిక గలదీ, భాసుర = ప్రకాశించే, తోయద = మేఘంవంటి, ఆభమ్ = కాంతిగలదీ అయిన, తే = నీ యొక్క, వాసః = వస్త్రం, శశి–ప్రభా+ఇవ = చంద్రకాంతివలె, వాతి+ఇవ = కదలుతున్నట్లుంది.

తా : దేవి! ప్రకాశవంతమైన నీ శరీరావయవాల మధ్య నీ వస్త్రం గాలికి రెపరెప లాడుతోంది. అది చంద్రకాంతిలా కనిపిస్తోంది. ప్రకాశించే మేఘకాంతితో తెల్లగా వెలుగుతున్న ఆ వస్త్రం గాలి కదలికల వలె కనిపిస్తోంది.





శ్లో॥ ఉదీర్ణఫేనః పయసస్తరఙ్గః
క్షీరాబ్ధిమధ్యే స్తన ఏక ఏషః?
త్వం దుర్నిరీక్ష్యాసి యదఙ్గకాన్తే
స్త్విషాక్షి మాతః ప్రతిహన్యతే మే ॥ 80

**ప్ర :** ఏషః = ఇది (ఎదుట కనిపిస్తున్నది), క్షీర+అబ్ధి–మధ్యే = పాలకడలిలో, ఉదీర్ణ–ఫేనః = అతిశయించిన నురుగుగల, పయసః = పాలయొక్క, తరంగః = అల, ఏకః = ఒక, స్తనః = రొమ్ము, త్వమ్ = నీవు, దుర్నిరీక్ష్యా = కష్టంతో చూడదగినదానవుగా, అసి = ఉన్నావు. యత్ = ఎందుకంటే, మాతః! = తల్లీ!, అంగ–కాన్తేః = శరీరశోభయొక్క, త్విషా = వెలుగుతో, మే = నా యొక్క, అక్షి = కన్ను, ప్రతిహన్యతే = మరల్పజేయబడుతోంది.

**తా :** పాలకడలిలో నురగలతో అతిశయించిన పాల అల నీ స్తనం. తల్లీ! నిన్ను చూడగలగటం కష్టం. ఎందుకంటే నీ శరీరశోభాకిరణం నా దృష్టిని వెనక్కు నెడుతోంది.





**శ్లో॥ సనాతనీ దేవి! శివస్య పూర్వం**
**వపుస్త్విదం ధారయసే యువత్యాః ।**
**తుభ్యం నమస్తుభ్యమనాదిమాత!**
**సౌమ్యా భవామ్బ ప్రణతేషు భీమే! ॥ 81**

**ప్ర :** దేవి! = దేవీ, సనాతనీ (అసి) = నీవు సనాతనవు. పూర్వమ్ = తొల్లి, శివస్య = శివునదైన, వపుః = శరీరాన్ని, ఇదమ్ = ఈ, యువత్యాః (వపుః) = యువతి శరీరంగా, ధారయసే = ధరిస్తున్నావు. అనాది–మాతః! = మొదలెరుగని తల్లీ!, తుభ్యమ్ = నీకు, నమః = నమస్కారం, భీమే = భయంకరమైనదానా!, అంబ = తల్లీ!, ప్రణతేషు = లొంగినవారిపై/ భక్తులపై, సౌమ్యా భవ = సౌమ్యురాలవు కమ్ము.

**తా :** దేవీ! నీవు సనాతనివి. అనాదిమాతవు. శివుని పూర్వరూపాన్ని ఇప్పుడు యువతి శరీరంగా ధరిస్తున్నావు. తల్లీ! నీకు నమస్కృతి. నీవు భీకరమైనదానవే అయినా నీ భక్తులకు సౌమ్యురాలవే కావాలి.





శ్లో॥ ఉద్దిశ్య భూమిం ద్రుమరాజినీలాం
శైలాన్తరాలేషు మహత్సు దృశ్యః ।
కారుణ్యమయ్యాః ప్రసృతః కరస్తే
దదాసి రుద్రాణ్యభయం ప్రజానామ్ ॥ 82

**ప్ర :** ద్రుమ... నీలామ్ : ద్రుమ = చెట్లయొక్క, రాజి = గుంపుచే, నీలామ్ = నల్లనైన, భూమిమ్ = భూమిని, ఉద్దిశ్య = నిర్దేశించి, మహత్సు = గొప్పవైన, శైల+అన్తరాలేషు = కొండల నడుమ, కారుణ్యమయ్యాః = దయామయివైన, తే = నీ యొక్క, కరః = చేయి, ప్రసృతః = చాచబడినది, రుద్రాణి! = రుద్రపత్ని!, ప్రజానామ్ = ప్రజలకు, అభయమ్ = అభయాన్ని (భయంలేని స్థితిని), దదాసి = ఇస్తున్నావు.

**తా :** రుద్రాణి! నీవు దయామయి. దట్టమయిన చెట్లతో నల్లనైన ఈ నేలపైకి గొప్పగొప్ప కొండల మధ్యనుండి నీ చేతిని ప్రసరింపజేస్తున్నావు. ఆ రీతిగా నీవు ప్రజలకు అభయమిస్తున్నావు.





శ్లో॥ తత్సంజ్ఞయా తే కరపల్లవస్య
తమో విధూతం భువి భారతానామ్ ।
రక్తస్య మేఘా నభసోఽపధూతా
అచిన్త్యవీర్యాసి శుభాసి సౌమ్యా ॥ 83

ప్ర : తే = నీ యొక్క, కరపల్లవస్య = కయిచివురాకుయొక్క, తత్–సంజ్ఞయా = ఆ సన్నతో, భువి = విశ్వంలో, భారతానామ్ = భారతీయులయొక్క, గమః = చీకటి, విధూతమ్ = తొలగింపబడింది. నభసః = ఆకాశంనుండీ, రక్తస్య మేఘాః = నెత్తుటి మొయిళ్ళు, అపధూతాః = నెట్టివేయబడ్డాయి. సౌమ్యా = నెమ్మదిగలదానవు!, అచిన్త్య-వీర్యా+అసి = ఊహకందని శక్తిగలదానవు, శుభా+అసి = మంగళకారిణివి.

తా : దేవి! నీ కరపల్లవంయొక్క సన్న చేతనే ఈ విశ్వంలోని భారతీయులయొక్క చీకటి తొలగింపబడుతోంది. రక్తమేఘాలు ఆకాశం నుండి నెట్టివేయబడ్డాయి. నీవు సౌమ్యవు. నీ శక్తి అనంతమైనది. నీవు మంగళకారిణివి.





శ్లో॥ సౌమ్యం వపుస్తే హిమవర్ణమార్యం
సౌమ్యం భవాన్యా వదనం హ్యుదారమ్ ।
శుక్లామ్బరాం యౌవనశుభ్రకాన్తిం
స్నేహార్ద్రనేత్రాం బలినీం నమామి ॥ 84

ప్ర : హిమ–వర్ణమ్ = మంచువన్నియగలదీ, ఆర్యమ్ = పూజనీయమూ అయిన, తే = నీ యొక్క, వపుః = శరీరం, సౌమ్యమ్ = ఉగ్రత్వం లేనిది. భవాన్యాః = భవానియొక్క, వదనమ్ = మోము, సౌమ్యమ్ = ప్రసన్నమైనదీ. ఉదారం హి = రమ్యమైనది కదా!, శుక్ల+అంబరామ్ = తెల్లని వస్త్రాలు గలదానవూ, యౌవన–శుభ్ర–కాన్తిమ్ : యౌవన = వయస్సుచే, శుభ్ర = నిష్కళంకమైఐన, కాన్తిమ్ = శోభగలదానవూ, స్నేహ+ఆర్ద్ర–నేత్రామ్ : స్నేహ = మైత్రితో, ఆర్ద్ర = తడిసిన, నేత్రామ్ = కన్నులు గలదానవూ, బలినీమ్ = బలసంపన్నవూ అయిన, త్వామ్ = నిన్ను (నీకు), నమామి = నమస్కరిస్తున్నాను.

**తా :** మంచువన్నె కలిగి, పూజనీయమైన నీ శరీరం సౌమ్యమైనది. ఉదారమైన నీ వదనం సౌమ్యమైనది. మైత్రితో నీ కనులు చెమ్మగిల్లుతాయి. యౌవనస్వచ్ఛత నీ శరీరకాంతిలో కనిపిస్తుంది. నీవు శ్వేతవస్త్రవు. బలసంపన్నవు. నీకు నమస్కరిస్తున్నాను.





శ్లో॥ నరాస్థిమాలా నృకపాలకాఞ్చీ
క్వ సా కరాలీ క్షుధితా చ కాలీ ।
నగ్నా చ ఘోరా వివృతాస్యభీమా
యస్యా విరావైః సహసోత్థితోఽస్మి ॥ 85

ప్ర : నర+అస్థి–మాలా = మానవుల ఎముకల మాలలు గలదీ, నృ–కపాల–కాంచీ = మానవుల పుర్రెల మొలనూలు గలదీ, క్షుధితా = ఆకలిగొన్నదీ, నగ్నా = దిగంబర అయినదీ, ఘోరా = భీకరమైనదీ, వివృత+ఆస్య–భీమా చ = తెరచిన నోటితో భయంకరమైనదీ, యస్యాః = ఎవరియొక్క, విరావైః = అరుపులతో, సహసా = వేగంగా/ త్వరగా, ఉత్థితః+అస్మి చ = లేచితినో, సా = ఆ, కరాలీ = భీకరమైన, కాళీ = కాళి, క్వ = ఎక్కడ?

**తా :** ఇంతకుముందు మానవులు ఎముకల మాలలూ, మానవుల పుర్రెల మొలనూలూ ధరించి, నగ్నంగా, ఘోరంగా, నోరుతెరిచి భయంకరంగా ఆకలిగొన్నట్లు కనిపించిన ఆ కరాళకాళి ఎక్కడ? ఆమె అరుపులతోనే గదా నేను త్వరగా లేచింది.





శ్లో॥ రక్తస్య యోఽయం వహతీహ సిన్ధు-
శ్ఛాయా శుభాయా హసతీవ తస్మిన్ ।
ఖడ్గం పరిభ్రామయతి స్తనన్తీ
నగ్నా సుఘోరా చ నమామి కాలీమ్ ॥ 86

ప్ర : యః+అయమ్ = ఏదయితే, రక్తస్య = నెత్తుటి యొక్క, సిన్ధుః = ఏరు, ఇహ = ఇక్కడ, వహతి = ప్రవహిస్తోందో, తస్మిన్ = దానిలో, శుభాయాః = మంగళకారిణివైన నీయొక్క, ఛాయా = నీడ, హసతి+ఇవ = నవ్వుతున్నట్లుంది. నగ్నా = దిగంబరయై, సుఘోరా = మరీ భయంకరమైనదై, స్తనన్తీ చ = గర్జించుచున్నదై, ఖడ్గమ్ = కత్తిని, పరిభ్రామయతి = త్రిప్పుతోంది (అటువంటి), కాలీమ్ = కాళికి, నమామి = నమస్కరిస్తున్నాను.

**తా :** ఇక్కడ ఇదిగో ఈ నెత్తుటేరిలో మంగళకారిణి అయిన నీ నీడ నవ్వుతున్నట్లు కనిపిస్తోంది. దిగంబరయై, ఘోరంగా భీకరంగా గర్జిస్తూ కత్తి త్రిప్పుతోంది. అటువంటి కాళికి నమస్కరిస్తున్నాను.





శ్లో॥ కాలీ త్వమేవాసి సునిష్ఠురాసి
త్వమన్నపూర్ణా సదయా చ సౌమ్యా ।
నమామి రౌద్రాం భువనాన్తకర్త్రీం
ప్రేమాకులామేవ నమామి రాధే! ॥ 87

**ప్ర :** సునిష్ఠురా = పరమక్రూరమైన, కాలీ = కాలివి, త్వమ్-ఏవ-అసి = నీవే, సదయా = దయామయివీ, సౌమ్యా చ = ప్రసన్నురాలవూ అయిన, అన్నపూర్ణా = అన్నపూర్ణవు, త్వమ్ - ఏవ - అసి = నీవే, భువన+అంత-కర్త్రీమ్ = లోకాలను అంతంచేసే, రౌద్రామ్ = ఉగ్రురాలికి, నమామి = నమస్కరిస్తున్నాను. రాధే! = రాధా స్వరూపా!, ప్రేమ+ఆకులామ్ ఏవ = ప్రేమలో లీనమైన, త్వామ్ = నిన్ను (నీకు), నమామి = నమస్కరిస్తున్నాను.

**తా :** క్రూరత్వాన్ని ప్రదర్శించే కాళివి నీవే. దయామయివి, ప్రసన్నురాలవు అయిన అన్నపూర్ణవూ నీవే. లోకాలను అంతంచేయగల క్రౌర్యం గల నీకు నమస్కరిస్తున్నాను. ప్రేమలో లీనవైన రాధాస్వరూపవైన నీకు నమస్కరిస్తున్నాను.





శ్లో॥ అనన్తశక్త్యృద్ధిమశేషమూర్తిం
కో వక్ష్యతీమాం తవ సర్వశక్తే ।
తేజస్త్వమేతద్బలినాం బలఞ్చ
త్వం కోమలానామపి కోమలాసి ॥ 88

ప్ర : సర్వ–శక్తే! = సమస్తశక్తులు గలదానా!, తవ = నీ యొక్క, ఇమామ్ = ఈ, అనన్త–శక్తి–ఋద్ధిమ్ : అనన్త = అంతులేని, శక్తి = శక్తి, ఋద్ధిమ్ = సంపదనూ, అశేష–మూర్తిమ్ = అనన్తస్వరూపాలనూ, కః = ఎవడు, వక్ష్యతి = చెప్పగలడు?, బలినామ్ = బలవంతులయొక్క, తేజః = తేజస్సూ, బలం చ = బలమూ, త్వమ్–ఏవ = నీవే, త్వమ్ = నీవు, కోమలానామ్ అపి = సున్నితమైన వారికంటే, కోమలా+అసి = సున్నితమైన దానవు.

**తా :** సర్వశక్తిగల దేవీ! నీ అనంతశక్తిసంపదనూ, అనేకమూర్తిమత్త్వాన్ని గురించి ఎవరు చెప్పగలరు? బలవంతుల బలమూ నువ్వే. తేజస్సువూ నువ్వే. కోమలులకన్న కోమలమైనదానవూ నీవే.





శ్లో॥ సౌమ్యామహన్త్వాం ద్విభుజాం నమామి
త్రిశూలినీం త్వామభయం వహన్తీమ్ ।
త్వామమ్బ! సావిత్రి! శుభే! త్రినేత్రే!
శుక్లాఙ్గవస్త్రాం వృషరూఢకాన్తిమ్ ॥ 89

**ప్ర :** అహమ్ = నేను, సౌమ్యామ్ = ప్రసన్నురాలవూ, ద్విభుజామ్ = రెండు భుజాలు గలదానవూ అయిన, త్వామ్ = నిన్ను (నీకు), నమామి = నమస్కరిస్తున్నాను. అభయమ్ = భక్తులకు అభయమిచ్చే బాధ్యతను, వహన్తీమ్ = వహిస్తూ, త్రిశూలినీమ్ = త్రిశూలంగల, త్వామ్ = నిన్ను (నీకు), నమామి = నమస్కరిస్తున్నాను. త్రినేత్రే! = మూడుకన్నులదానా!, శుభే = మంగళకారిణి!, సావిత్రి = ఉమా!, అంబ! = తల్లి!, వృష-రూఢ-కాన్తిమ్ : వృష = ఎద్దుపై, రూఢ = స్థిరంగా నిలిచియున్న, కాన్తిమ్ = కాంతిస్వరూపవై, శుక్ల-అంగ-వస్త్రామ్ = తెల్లని అవయవాలూ, వస్త్రాలూ గల, అంబ! = తల్లీ!, త్వామ్ = నిన్ను (నీకు), నమామి = నమస్కరిస్తున్నాను.

**తా :** ద్విబాహువువై ప్రసన్నురాలవైన నీకు నమస్కరిస్తున్నాను. త్రిశూలధారిణివై అభయభారం వహిస్తున్న నీకు నమస్కారం చేస్తున్నాను. త్రినేత్ర! సావిత్రి! అంబ! శుభా! ఎద్దుపై శ్వేతకాంతిగా శ్వేతావయవాలతో, శ్వేతవస్త్రాలతో నిలిచివున్న నీకు నమస్కరిస్తున్నాను.





శ్లో॥ దశాయుధాఢ్యా దశదిక్ష్వగమ్యా
పాతాసి మాతర్దశబాహురార్యాన్ ।
సహస్రహస్తైరుపగృహ్య పుత్రా-
నాస్సే జగద్యోనిరచిన్త్యవీర్యా ॥ 90

ప్ర : మాతః! = జననీ!, దశ+ఆయుధ+ఆఢ్యా = పది ఆయుధాలతో బలిష్ఠవై, దశ-దిక్షు = పది దిక్కులలో, అగమ్యా = అందనిదానవై, దశబాహుః = పది చేతులతో, ఆర్యాన్ = ఆర్యులను, పాతాసి = రక్షింపగలవు. జగద్-యోనిః = విశ్వకారణమై, అచిన్త్య-వీర్యా = ఊహకందని పరాక్రమం గలదానవై, సహస్ర-హస్తైః = వేల చేతులతో, పుత్రాన్ = బిడ్డలను, ఉపగృహ్య = పొదివిపట్టుకొని, ఆస్సే = ఉన్నావు.

**తా :** తల్లీ! పది ఆయుధాలు ధరించిన శక్తిమంతురాలవు నీవు. దశదిక్కులలో కూడా నీ ఉనికిని గుర్తించలేము. దశబాహువులు గలదానవై నీవు ఆర్యులను రక్షిస్తున్నావు. అచిన్త్యతేజస్సు గలిగి విశ్వకారణమైన నీవు వేల చేతులతో నీ బిడ్డలను పొదువుకొని ఉన్నావు.





శ్లో॥ ప్రకాశయన్తీం గహనాని భాసై-
ర్భీమాం జ్వలత్పర్వతమూర్తిమగ్ర్యామ్ ।
పశ్యామి దేవీం నగరేషు సౌమ్యాం
ద్వారి స్థితామార్యభువః సఖడ్గామ్ ॥ 91

ప్ర : భాసైః = కాంతులతో, గహనాని = అరణ్యాలను, ప్రకాశయన్తీమ్ = వెలుగొందజేయునదీ, భీమామ్ = భీకరమైనదీ, అగ్ర్యామ్ = శ్రేష్ఠమైనదీ, జ్వలత్-పర్వత-మూర్తిమ్ : జ్వలత్ = మండుతున్న, పర్వతమూర్తిమ్ = పర్వతాకారం గలదీ అయిన, దేవీమ్ = దేవిని, పశ్యామి = చూస్తున్నాను. నగరేషు = నగరాలలో, సఖడ్గామ్ = కత్తితో సహా, ఆర్య-భువః = ఆర్యభూమియొక్క, ద్వారి = ద్వారప్రదేశంలో, స్థితామ్ = నిలిచి, సౌమ్యామ్ = ప్రసన్నంగా ఉన్న, దేవీమ్ = దేవిని, పశ్యామి = చూస్తున్నాను.

**తా :** దేవీ! కాంతులతో దుర్గమారణ్యాలను కూడా ప్రకాశింపజేస్తూ, మండుతున్న పర్వతాల వంటి శ్రేష్ఠమైన, భీకరమైన నీ రూపాన్ని చూస్తున్నాను. నగరాలలో కత్తిపట్టి ఆర్యభూ ద్వారంలో సౌమ్యమూర్తితో నిలిచి ఉన్న నిన్ను చూస్తున్నాను.





శ్లో॥ కలిం దమిత్వా జననీ ప్రజానాం
సత్త్వాధికాపత్యకులైర్విభాతి ।
స్వాధీనవృత్తీని పునశ్చరన్తి
పశ్యామి తాన్యాగమమార్గగాణి ॥ 92

ప్ర : కలిమ్ = కలి (పురుష)ని/విపత్కర స్థితిని, దమిత్వా = అణచివేసి, ప్రజానామ్ = జనులకు, జననీ = తల్లివై, సత్త్వ+అధిక+అపత్య-కులైః : సత్త్వ = సత్త్వగుణంచేత/ప్రాణులలో, అధిక = మిన్న అయిన, అపత్య-కులైః = సంతతిసమూహాలతో, విభాతి = ప్రకాశిస్తోంది. పునః = మరల, తాని = ఆ సంతతి సమూహాలు, స్వ+అధీన-వృత్తీని = స్వేచ్ఛాప్రవృత్తిగలవై, చరన్తి = నడుస్తున్నాయి. ఆగమ-మార్గగాణి = వేదమార్గంలో పయనిస్తున్న, తాని = ఆ సంతాన సమూహాలను, పశ్యామి = చూస్తున్నాను.

**తా :** సత్త్వసంపన్న అయిన జనజనని కలిని అణచివేసి, తన సంతతి సమూహాలతో ప్రకాశిస్తోంది. ఆ సంతతి సమూహాలు మరల స్వేచ్ఛావృత్తులై తిరుగుతున్నాయి. వేదమార్గంలో పయనిస్తున్న వారు కళ్ళముందు కనిపిస్తున్నారు.





శ్లో॥ పునః శృణోమీమమరణ్యభూమౌ
వేదస్య ఘోషం హృదయామృతోత్సమ్ ।
సుజ్ఞానినామాశ్రమగా మునీనాం
కుల్యేవ పుంసాం వహతి ప్రపూర్ణా ॥ 93

ప్ర : పునః = మరల, అరణ్య–భూమౌ = అటవీప్రదేశాలలో/ఆశ్రమాలలో, హృదయ+అమృత+ఉత్సమ్ : హృదయ = మనస్సులకు, అమృత+ఉత్సమ్ = అమృతపు ఊట వంటి, ఇమమ్ = ఈ, వేదస్య ఘోషమ్ = వేదనాదాన్ని, శృణోమి = వింటున్నాను. సుజ్ఞానినామ్ = పరమజ్ఞానులైన, మునీనామ్ = ఋషులయొక్క, ఆశ్రమగా = ఆశ్రమాలకు వెళ్తున్న, ప్రపూర్ణా = నిండైన, పుంసామ్ = మనుజులయొక్క, కుల్యా+ఇవ = పంటకాలువవలె, వహతి = ప్రవహిస్తోంది.

**తా :** మరల అరణ్యాలలోని ఆశ్రమాలలో హృదయాలకు అమృతపు ఊటవంటి వేదఘోషను వింటున్నాను. పరమజ్ఞానులయిన మునుల ఆశ్రమాలలో మానవీయమై నిండైన పంటకాలువలా వేదనాదం ప్రవహిస్తోంది.





శ్లో॥ సనాతనాన్ రక్షతి ధర్మమార్గాన్
పునః సహస్రాంశుకులార్యజన్మా ।
లక్ష్మీః పునః సాప్యచలా స్మితాస్యా
సముజ్జ్వలా రాజతి భారతేషు ॥ 94

ప్ర : పునః = మరల, సహస్రాంశు-కుల-ఆర్య-జన్మా : సహస్రాంశు-కుల = సూర్యవంశంలోని, ఆర్య = ఆర్యులలో, జన్మా = జన్మ గలిగిన వాడు, సనాతనాన్ = ప్రాచీనాలయిన, ధర్మ-మార్గాన్ = ధర్మాచరణ పద్ధతులను, రక్షతి = కాపాడుతాడు. స్మిత+ఆస్యా = నగుమోముగలదీ, సముజ్జ్వలా = కాంతిమంతమైనదీ అయిన, లక్ష్మీః అపి = సిరి కూడా, అచలా = కదలకుండా, పునః = మరల, భారతేషు = భారతీయులలో/ భారతదేశంలో, రాజతి = ప్రకాశిస్తుంది.

**తా :** మరల సూర్యవంశంలో పుట్టిన ఆర్యుడు సనాతన ధర్మసంరక్షణ చేయగలడు. లక్ష్మి నగుమోముతో ఔజ్జ్వల్యంతో నిశ్చలంగా భారతదేశంలో నిలువగలదు.





శ్లో॥ పురాతనీం మాతరమాగమానా-
మాగచ్ఛతాఇ్చ స్తువతాఇ్చ భూమిమ్ ।
ప్రాచ్యాం ప్రతీచ్యాం జగతోఽఖిలస్య
కోలాహలం వేగరవాఇ్శృణోమి ॥ 95

ప్ర : ప్రాచ్యామ్ = తూర్పున, ప్రతీచ్యామ్ = పడమట, పురాతనీమ్ = ప్రాచీనమైన, ఆగమానామ్ = వేదాలయొక్క, మాతరమ్ = జననియైన, భూమిమ్ = భారతభూమికి, ఆగచ్ఛతామ్ = వస్తున్నవారియొక్క, స్తువతాం చ = స్తుతిస్తున్నవారి యొక్కయు, అఖిలస్య = సమస్తమైన, జగతః = ప్రపంచంయొక్క, కోలాహలమ్ = హడావుడినీ, వేగ-రవాన్ చ = త్వరతో గూడిన చప్పుళ్ళను కూడా, శృణోమి = వింటున్నాను.

**తా :** తూర్పుదేశాల నుండీ, పశ్చిమదేశాలనుండీ పురాతనమైన భారతభూమివైపూ, వేదమాతవైపు నడుస్తూ, స్తుతిస్తూ ఉన్న సమస్తవిశ్వంయొక్క కోలాహలాన్నీ, సంభ్రమ ధ్వనులనూ వింటున్నాను.





శ్లో॥ సద్ధర్మగర్భేతి మహావ్రతేతి
స్తువన్తి సౌమ్యాఞ్చ భయంకరాఞ్చ ।
దేవ్యాః ప్రియాం భూమిమనాది శక్త్యా-
స్తీర్థస్వరూపేణ చ పూజయన్తి ॥ **96**

**ప్ర :** సద్-ధర్మ-గర్భా+ఇతి = సద్ధర్మాలను తనలో ఇముడ్చుకొన్నదనీ, మహా-వ్రతా+ఇతి = గొప్ప వ్రతాలు పాటించేది అనీ, సౌమ్యాం చ = ప్రసన్నురాలూ, భయంకరాం చ = ఉగ్రురాలూ అయిన భవానిని, స్తువన్తి = ప్రశంసిస్తున్నారు. అనాది-శక్త్యాః = మొదలెరుగని శక్తిగల, దేవ్యాః = భవానీదేవికి, ప్రియామ్ = ఇష్టమైన, భూమిమ్ = భారతభూమిని, తీర్థ-స్వరూపేణ చ = తీర్థాలు గల యాత్రాస్థలంగా కూడా, పూజయన్తి = అర్చిస్తున్నారు.

**తా :** సౌమ్యురాలూ, ఉగ్రురాలూ అయిన భవానిని తనలో సద్ధర్మాలనూ, మహావ్రతాలనూ ఇముడ్చుకొన్నదని స్తుతిస్తున్నారు. అనాదిశక్తిగల ఈ దేవి కిష్టమైన **భారతభూమి**ని తీర్థయాత్రాస్థలంగా పూజిస్తున్నారు.





శ్లో॥ శివస్య కాశ్యాం నివసన్తి యే కే
స్పర్శేన తే తస్య భవన్తి ముక్తాః ।
దేవ్యాస్తు పుణ్యేన పదార్పణేన
సర్వార్యభూమిర్జగతోఽపి కాశీ ॥ 97

ప్ర : యే కే = ఏ కొందరయితే, శివస్య = శివునియొక్క, కాశ్యామ్ = కాశియందు, నివసన్తి = నివసిస్తున్నారో, తే = వారు, తస్య = ఆ శివునియొక్క, స్పర్శేన = తాకిడితో, ముక్తాః = విముక్తులు, భవన్తి = అవుతున్నారు. తు = కానీ, పుణ్యేన = పవిత్రమైన, దేవ్యాః = భవానీదేవియొక్క, పద+అర్పణేన = కాలు మోపుటచే, సర్వా = సంపూర్ణమైన, ఆర్యభూమిః = ఆర్యావర్తం (భారతదేశం), జగతః అపి = విశ్వానికే, కాశీ (భవతి) = కాశి అవుతోంది.

**తా :** శివుని కాశిలో నివసించేవారు శివస్పర్శకారణంగా ముక్తులవుతారు (మోక్షాన్ని పొందుతారు). కానీ పవిత్రమైన భవాని పదార్పణం వలన **భారతదేశమే విశ్వానికి కాశీగా** ఉంటుంది.





శ్లో॥ ప్రీతిర్దయా ధైర్యమదమ్యశౌర్యం
శ్రద్ధా తితిక్షా వివిధాశ్చ విద్యాః ।
అనన్తరూపే! త్వమసి ప్రసీద
చిరం వసార్యే! హృది భారతానామ్ ॥98

**ప్ర :** అనన్త–రూపే = అంతులేనన్ని రూపాలు గలదానా!, ప్రీతిః = ప్రేమ, దయా = కరుణ, ధైర్యమ్ = తెగువ, అదమ్య–శౌర్యమ్ = అణచరాని పరాక్రమం, శ్రద్ధా = ఆసక్తి, తితిక్ష = ఓర్పు, వివిధాః = అనేకములైన, విద్యాః = చదువులూ, త్వమ్ – అసి = నీవే. ప్రసీద = అనుగ్రహించు, ఆర్యే = పూజ్యురాలా!, భారతానామ్ = భారతీయుల యొక్క, హృది = మనస్సు(ల)లో, చిరమ్ = చిరకాలమూ, వస = నివసించు.

**తా :** అనన్తరూపాలుగల దేవీ! ప్రేమ, కరుణ, తెగువ, పరాక్రమం, ఆసక్తి, ఓర్పు సర్వవిద్యలూ నీవే. మమ్మ అనుగ్రహించు. పూజ్యురాలా! భారతీయుల హృదయాలలో శాశ్వతంగా నిలిచిపో.





శ్లో॥ సిన్ధూన్ హిమాద్రిఞ్చ సుసౌమ్యభాసా
ప్రకాశయన్తీ సుదృఢప్రతిష్ఠా ।
తిష్ఠ ప్రసన్నా చిరమార్యభూమౌ
మహాప్రతాపే జగతో హితాయ ॥ 99

ప్ర : మహా–ప్రతాపే = గొప్ప పరాక్రమం గలదానా!, సిన్ధూన్ = సముద్రాలనూ, హిమ+అద్రిం చ = మంచుకొండనూ (హిమాలయాన్నీ), సు–సౌమ్య–భాసా = బాగా ప్రసన్నమైన కాంతితో, ప్రకాశయన్తీ = వెలిగింపజేస్తూ, సు–దృఢ–ప్రతిష్ఠా = అచంచలమైన ప్రతిష్ఠ (కీర్తి)తో, ప్రసన్నా = ప్రసన్నురాలవై, జగతః = ప్రపంచంయొక్క, హితాయ = మేలుకొరకు, చిరమ్ = శాశ్వతంగా, ఆర్యభూమౌ = ఆర్యావర్తం (భారతదేశం)లో, తిష్ఠ = నిలు.

**తా :** మహాప్రతాపంగల భవానీ! సాగరాలనూ, హిమాలయాలనూ ప్రసన్నకాంతులతో వెలుగొందజేస్తూ అచంచల (కీర్తి) ప్రతిష్ఠలతో ఆర్యభూమిలో అనుగ్రహదృష్టితో నిలిచిపో. అది లోకహితం కోసమే.



# శ్లోకానుక్రమణిక

ఈ వృత్తాలన్నీ ఇంద్రవజ్ర, ఉపేంద్రవజ్రల కలయికచే ఏర్పడే ఉపజాతి భేదాలు.

| శ్లోకము | ఛందస్సు | శ్లో.సంఖ్య |
|---|---|---|
| అనన్త | కీర్తిః | **88** |
| అస్త్యేవ | శాలా | **20** |
| ఆజౌ | భద్రా | **56** |
| ఆపూర్య | ఇన్ద్రవజ్రా | **7** |
| ఆలోల | వాణీ | **8** |
| ఇతీరయన్తీ | కీర్తిః | **44** |
| ఇమాని | కీర్తిః | **32** |
| ఉత్తిష్ఠ దేహీతి | బాలా | **9** |
| ఉత్తిష్ఠ భో | ఇన్ద్రవజ్రా | **18** |
| ఉదీర్ణఫేనః | ఆర్ద్రా | **80** |
| ఉద్దిశ్య | బాలా | **82** |
| ఏకో | బాలా | **70** |
| కం బిభ్యతార్యా | మాయా | **29** |
| కః క్షాత్రబన్ధు | ఇన్ద్రవజ్రా | **19** |
| కృష్ణస్య | ఇన్ద్రవజ్రా | **64** |
| కులాని | కీర్తిః | **38** |
| క్రూరాసి | ప్రేమా | **69** |
| క్రూరైః | బాలా | **6** |
| కలిం | కీర్తిః | **93** |
| కవే | ఆర్ద్రా | **30** |
| కస్తో | ఇన్ద్రవజ్రా | **55** |
| కాన్తైశ్చ | శాలా | **2** |
| కాలస్య | బాలా | **25** |

| | | |
|---|---|---|
| కాలీ | మాయా | 87 |
| క్లీబాః | మాయా | 16 |
| క్షోభేణ | ఇన్ద్రవజ్రా | 41 |
| ఖలం | కీర్తిః | 37 |
| ఖురైః | కీర్తిః | 67 |
| చక్రస్ద | భద్రా | 3 |
| జ్వాలాకరాలా | ఇన్ద్రవజ్రా | 45 |
| జ్ఞాత్వా | ఇన్ద్రవజ్రా | 42 |
| జ్ఞానాకరేభ్యో | భద్రా | 53 |
| తత్సంజ్ఞయా | భద్రా | 83 |
| తదా | హంసీ | 48 |
| తదా దదర్శా | మాలా | 35 |
| తాం హ్లాదితా | మాయా | 51 |
| తుభ్యం నమో | మాయా/బాలా | 54,73 |
| తే బ్రహ్మచర్యేణ | రామా | 13 |
| త్రైలోక్య | ఇన్ద్రవజ్రా | 40 |
| త్వమీశ్వరీ | ఆర్ద్రా | 74 |
| దయార్ద్రచిత్తా | ఆర్ద్రా | 57 |
| దశాయుధా | హంసీ | 90 |
| దీనాః | శాలా | 15 |
| దేహి | శాలా | 26 |
| ద్రష్టుం | శాలా | 78 |
| ద్వికోటి | కీర్తిః | 50 |
| ధేనౌ | భద్రా | 60 |
| నమో నమో | ప్రేమా | 75 |

| | | |
|---|---|---|
| నమో నమో దేవి | మాలా | 76 |
| నరాస్థిమాలా | మాలా | 85 |
| నరాస్థిమాలాం | మాలా | 5 |
| పదా | హంసీ | 36 |
| పునః | కీర్తిః | 93 |
| పురాతనీం | కీర్తిః | 95 |
| ప్రకాశయన్తీం | కీర్తిః | 91 |
| ప్రక్షిప్తఖడ్గస్తు | రామా | 72 |
| ప్రీతిర్దయా | రామా | 98 |
| భగ్నాని | వాణీ | 68 |
| భీతః | ఇన్ద్రవజ్రా | 10 |
| భీమైః | వాణీ | 39 |
| భీమో | మాయా | 47 |
| భో భో | బాలా | 23 |
| మాతాఽస్మి | వాణీ | 12 |
| మ్లేచ్ఛ | బాలా | 22 |
| మ్లేచ్ఛస్య | బాలా | 17 |
| యే కే త్రిమూర్తిం | ఇన్ద్రవజ్రా | 24 |
| యేషాం | ఇన్ద్రవజ్రా | 28 |
| రక్తప్రవాహైరపి | మాయా | 27 |
| రక్తస్య | ఇన్ద్రవజ్రా | 86 |
| రక్తాక్తమేఘా | భద్రా | 46 |
| వ్యూహోస్త్వ | వాణీ | 62 |
| వైశ్యోఽసి | వాణీ | 21 |
| శక్తిః | బాలా | 58 |

| | | |
|---|---|---|
| శివస్య | కీర్తిః | 97 |
| శుక్లం | ఇన్ద్రవజ్రా | 79 |
| శూరాః | ఇన్ద్రవజ్రా | 14 |
| శృణోమి | ఉపేన్ద్రవజ్రా | 63 |
| శ్వేతాననే | భద్రా | 77 |
| సద్యోఽపి | బాలా | 59 |
| సద్ధర్మ | వాణీ | 96 |
| సనాతనా | మాలా | 31 |
| సనాతనాన్ | ప్రేమా | 94 |
| సనాతనీ | మాలా | 81 |
| స భ్రామయామాస | బాలా | 34 |
| సమాకులం | బుద్ధిః | 49 |
| సమాధిధీరా | మాలా | 52 |
| సాంద్రం | వాణీ | 33 |
| సా శుభ్రవర్ణా | భద్రా | 61 |
| సిన్ధూన్ | భద్రా | 99 |
| సిన్ధోస్తటే | బాలా | 66 |
| సింహస్య | రామా | 11 |
| సుఖం | మాలా | 4 |
| సుఖే | జాయా | 1 |
| సుప్తేషు | బుద్ధిః | 43 |
| సౌమ్యం | ఇన్ద్రవజ్రా | 84 |
| సౌమ్యామహం | వాణీ | 89 |
| స్పృష్టాస్త్రిశూలేన | భద్రా | 65 |
| స్రోతాంసి | ఇన్ద్రవజ్రా | 71 |

